Regd. No. H. 373

# ఆంధ్రప్రదేశ్

Kohistan

n the distance thou didst appear
barricaded in rocky aloofness.
dly I crossed the rugged path
to find here all of a sudden
open invitation in the sky.
and friend's embrace in the air.
he unknown land the voice that
seemed ever known
revealed to me a shelter
of loving intimacy.
Rabindranath Tagore

సంపుటి 5 సంచిక 8
జూన్ 1961
జ్యేష్ఠ - ఆషాఢ - 1883 శకము




ఏలేశ్వరంలో త్రవ్వబడిన "వేణుగోపాల" విగ్రహం



ప్రాచీనకాలపు కంఠాభరణం :
ఏలేశ్వరంలో త్రవ్వి
తీయబడినది.

# ఆంధ్రప్రదేశ్

సంపుటి 5 | జూన్ 1961<br>జ్యేష్ఠ-ఆషాఢ—1883 శకము | సంచిక 8

# విషయసూచిక

*ముఖచిత్రం* : హైదరాబాదులోని బంజారాకొండల పైన 1933 డిసెంబరులో గురుదేవుడు టాగూరు వ్రాసినపద్యం (నవాబ్ మెహిదీనవాజ్ జంగ్ బహదూర్ గారి సౌజన్యంతో)

**వెనుకఅట్ట** : ఏలేశ్వరం పెవిలియన్—హైదరాబాదులో 11-5-61 న ప్రారంభింపబడినది.

## చందావివరాలు

| | | |
|---|---|---|
| సంవత్సరానికి | — | 3 రూపాయలు |
| విడి ప్రతి వెల | — | 25 నయాపైసలు |

**Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1**
**Printed at Yuva Press, Public Garden Road, Hyderabad-1**

# మల్లసీమ

భార్గవ విద్యాదేవ కులపతి

మల్ల కవిమల్ల మాంత్రిక మౌనముద్ర
మర్మ మెరిగిన ఒక మహా కర్మయోగి
ప్రప్రథమ వీరభారత బ్రహ్మచారి
సూర్యు డాకాశమున కార్త వీర్యుడయ్యె.

సుమధుర సాంధ్యరాగముల శోభలు స్వర్ణమయూఖ మాలికల్
ప్రమదమొసంగ నల్లదె విరాజిలు వీరవిహారభూమి-ఆ
అమృతరసార్ద్ర దివ్య కరుణాకర వాయు తనూజ రక్షితో
ద్యమమయి సత్య సంస్కృతి మహాబల వైభవ వర్ధమానమై-

అది సంధ్యా సమయారుణారుణ మయూఖానంత రేఖాంత ము
న్మద దంతావళబిందు ధాతురస పౌనః పున్య ముల్లాస సం
పద లొప్పంగ వెలుంగు నయ్యదె! మహాబాహుల్ రణోత్సాహుల
భ్యుదయాదేశము గాంచు దేశము బలవ్యూహా మహాకేంద్రమై.

చెల్లెలి కట్టదాటి వివశీకృత భావ పరంపరా ప్రవా
హోల్ల సనమ్ములో కవుల ఊహలు పర్విడ జేయు మూర్తి రం
జిల్లగ స్ఫూర్తి కీర్తి వికసిల్లగ చల్లగ నల్లదే విరా
జిల్లును మల్లభూమి బలసింధువు బంధుర బాహు బంధువై.

పూచిన పారిజాతముల పోలిక పద్మపరాగ రాగముల్
మోచిన పద్మరాగముల పొల్పున ఉల్లసిలెన్ వికంప శం
పాచయ శక్తి బింబములు మల్ల మహాద్భుత దృశ్య దర్శనో
ర్వీ చలన ప్రమాణ పదవీ పరిమాణ పదావలంబముల్

ఆయత బాహులున్నత సహస్ర భుజా బలవీర్య కార్త వీ
ర్యాయత శౌర్యధైర్యు లలరారుదు రందు వర ప్రసాద తే
జోయుతులున్ మహోదయ విశుద్ధ గుణోత్తరు లార్య వైఖరీ
నాయక ధీరవర్తనులనంత కళాంతర మూర్తి వైభవుల్

సంభృతారంభ నవశాతకుంభ కుంభ
లీల తిలతైల సేచనోల్లాలితంబు
రాగ రంజిత కిసలయారక్త యోగ
రంగ మంగళ మదియె మల్లాంగణంబు.

నిరత నీరాభిషేక వినిర్మలంబు
నియత పూజా విశేష వినిశ్చలంబు
అగుచు నలరారు విశ్వ విఖ్యాత కీర్తి
సుస్థిర స్ఫూర్తి నచటి మల్ల స్థలంబు.

ఆంజనేయాది పూజనా రంజితములు
అగరుధూప ప్రసూన గంధాంచితములు
శుభ్ర కర్పూర హారతి శోభితములు
అతి పవిత్రంబులా ప్రదేశాంతరములు.

వందల్ వేలుగ వట్టి వేళ్ళపొడి బావంచాలు కచ్చూరముల్
సిందూరమ్మును రక్త చందనము రాసిం జేసి చూర్ణించి ఇ
ట్లెంతెందో గల మూలికా చయము లెన్నెన్నో అమూల్యౌషధుల్
సందర్భంబుగ కల్పిరా అరుణ మృత్స్నాపూర్ణ మల్లస్థలిన్.

శ్రమ సమారంభ మల్ల సంరంభ మహిత
సమద విశ్రాంతి రహిత దేహముల నుండి
లవణ సహిత కాలుష్య సంభవము లగుచు
క్రమ్ము కొని వచ్చె నశ్రాంత ఘర్మజలము.

అనుకొనిన యంతపూర్తి యౌనంత దాక
బాధ యెంతైన వీడిపోవంగ బోరు
అట్లు కష్టించుటెల్ల దేహముల మీది
ప్రేమయో ప్రేమ లేమియో యేమొగాని.

కష్ట ముత్కృష్ట మద్భుత కర్మ సహము
నైన వ్యాయామ తపములో లీనులగుచు
దేహ మానస వాసనా తీతులైన
మౌనివరులైరి మల్ల సమ్రాట్టు లెల్ల.

కలుషముల నంత[redacted]మ్ముల కడిగివైచి
వెలికి స్రవియించె వారికి స్వేదజలము
అధిక నిష్ఠాభగీరథ యత్నమునకు
భవుని జటనుండి గంగాభవాని వోలె.

అమ్మహనీయ మూర్తుల మహత్తర కర్మనిమగ్న దేహ భా
గమ్ముల వెల్లివారుచు పొగల్ వెలిగ్రక్కుచు యామున ప్రవా
హమ్ము విధమ్మునన్ నవరసార్ద్ర పథమ్మున ఘర్మ పూరముల్
ముమ్మరమయ్యె వారికణ పూరములై నదులై నదమ్ములై.

పాటల శంబుజూట పరిపాటి నవోజ్జ్వల వృత్తి మృత్తికా
వాటి శయింపఁజేసి గళభాగము దాకను పూడ్ప చిత్రముల్
వాటిల వారి దేహములపై పొర సైకతమయ్యె-ఆపయిన్
బీటలు వారి పైకెగసె భీమనిదాఘ నిదాఘ ధూమముల్.

వ్రాలి శిరమ్ము వంచి గురు పాదములంటి నమస్కరించి ఉ
ద్వేల కళాజిగీష నరుదెంతురు వారు సముల్లసద్భుజా
స్ఫాలన కర్కశధ్వనులు భైరవ హుంకృతులై సెలంగ లీ
లాలసయానగంధగజులై మద ఘూర్ణిత నేత్ర పద్ములై.

ఉన్నతము లుద్ధతమ్ములుఉజ్జ్వలములు
వినమితమ్ములు వినతముల్ విస్తృతములు
వారి యెదలు, ప్రధానము వారికెపుడు
అచలమగు నిష్ఠ బ్రహ్మచర్య ప్రతిష్ఠ.

ఠీవి మెరయంగ అగ్ర పీఠిన్ వసించి
యున్న వాడీ మహావిద్య గన్నవాడు
ఆ మహామహు బ్రహ్మ చర్యంబు గాదె
ఈ మహా సంస్థ కెపుడు శ్రీరామరక్ష.

ప్రకటవికటారినికటదుర్మదమహోగ్ర
కర్కశకఠోరసంఘ సంఘాతములకు
వెరపెరుంగని ధీర గంభీర మూర్తి
శత్రు సమవర్తి-గురులోక చక్రవర్తి.

జిత సకలప్రపంచుడౌటె! శృంగిత కీర్తియటె! మహో భుజో
న్నత బలశాలియట్టె! కరుణామయ మూర్తియటే! సుశిక్షితా
హితుడటె! శిష్యవత్సలుడటే! కృతహస్తుడునట్టె! ధర్మస
మ్మతుడటె! బ్రహ్మచర్య జితమారుడటే! అతడెల్ల కాలముః.

రోచిర్మూర్తులు శిష్యకోటు లోకసై రూపొంది వీరాశ్రమ
ప్రాచుర్యంబున భక్తితో కులపతిత్వ ప్రౌఢి పూజింపగా
ప్రాచీనత్వము నూతనత్వమున ఆరాధించు విద్యాగురుం
డా చార్యుం డత డమ్మహా మహుడు ద్రోణాచార్యుడీ సంస్థకుః.

అతడు మల్లయుద్ధ సముదార యశోనిధి-ముష్టి యుద్ధ వి
ఖ్యాతుడి తండు దుర్భర మహత్తర భార సముద్వహోది వి
ద్యా తరుణుం డితండు సుమహోగ్రమహోగ్ర బలప్రదర్శనో
ద్యోతితు డింత యేల? ఒకరొక్కరెరుంగుదు రెన్నొ విద్యలః.

ధీరులు శాంత మూర్తులు సతీర్థ్యులు సింహబలుల్ సముజ్జ్వల
చారులు శీలవంతులు ప్రశాంతులు క్లాంతి విదూరులమ్మహా
వీరులు వారిలోన పృథివిః గెలువంగల రొక్కరొక్కరే
వారికి వారెసాటి అనవద్యులు వారు రణాంగణమ్ములః.

ఎట్టి మహాత్వమో ప్రతిభ యెట్టిదియో అతడెట్టి మల్ల స
మ్రాట్టును గూడ గెల్చు క్షణ మాత్రములో ఎటువంటి వీరునిః
మట్టి యొనర్చు మల్ల రణమర్మ విశారదు డాతడింతకుః
పెట్టని కోట ఆతనిది పెట్టిన పేరు భుజాబలమ్మునః.

చక్కని కండరాలు రుచి సంపద నింపగ ఆతడల్లదే
చిక్కని కండలః వెలుగుచే నులిచే నొకశిల్పి శిల్పముః
చెక్కిన యట్టులందములు చిందు శరీరపు పెంపు సొంపులః
ఉక్కు మనుష్యు డాతడొక యోధవరేణ్యుడు మల్ల మండలిః.

స్నాయు స్నాయువు శక్తి మంతము సదా సంగ్రామ సజ్జీకృత
స్వీయా జేయజిత శ్రమత్వము కళా శ్రీమన్మహోదార తే
జో యూథంబుగ యోధుడై అలరు విస్ఫూర్తి స్ఫురన్మూర్తితో
వ్యాయా మస్థిర సంధి బంధ కటకుం డాతండు సామాన్యుడే!

ఎట్టుల్ చేతుల కల్పునో విడుచునో ఏ పట్టునే పట్టునం
దెట్టుల్ చేయునో ఎవ్వరున్ తెలియ లేనేలేదు చిత్రమ్ముగా
ఇట్టే త్రిప్పును ఎంతవాని నయినన్ హేలా కళా దీప్తి—ఈ
జెట్టిన్ మెచ్చుకొనంగ శక్యమె జగజ్జేతన్ మహావీరునిన్.

చతుర్వ్యాఘ్ర సహస్ర సంచయము లాశ్చర్యాతిరేకమ్ముతో
వీక్షింపంగ క్షణమ్ములో విజయుడై విన్యాసుడై వీరుడై
అక్షయ్యంబగు దేశ గౌరవము నిండారించు నుద్దండతన్
సాక్షాద్రాముడొ ? భీముడో ? యనిజనుల్ స్పందించి వందింపగన్.

పక్ష్మా పాతములో మహాబలము సంభావించు శౌర్యంబుతో
ఈక్ష్మా మండల మొక్కటై ఒకడు పైకే తెంచినన్ సత్కళా
లక్ష్మీ నాథుడతండు సత్యగుణ ముల్లంఘింపడే మాత్రమే
సూక్ష్మ గ్రాహితరంబె? అతని గతిన్ శోధించి సాధింపగన్.

అజ్ఞేయంబు లజేయముల్ కనదనన్యాన్యోన్యా గూఢ క్రియల్
విజ్ఞానైక కళా రహస్యములు హృద్వీథీ విటంకమ్ములో
ఆజ్ఞాపాలన మాచరించు వినయ వ్యాపార మేపారగా
ప్రజ్ఞా చక్షువటందు రెల్లరును వీర గ్రామణిన్ ధీమణిన్.

దస్త్రీయో యెదో వాదమయ్యెను ప్రవాదంబయ్యె ఏ మర్మమున్
విస్తారించెనొ గాని వెల్లికల ద్రిప్పెన్ గాలినో నేలనో
కుస్తీ గొప్పది యేమిచేసె నొకొ కన్గోలేని దీవింత ఈ
వస్తా దెవ్వరొ పెద్ద చేయని ప్రజల్ భావింతు రుబ్బూగుచున్.

విద్యుద్వేగముతో జితశ్రమకళావిశ్రాంతివిక్రాంతితో
విద్యోతించి విరోధి మర్మగతులన్ వేధించి రోధించు నీ
సద్యస్స్ఫూర్తికి స్వాగతంబులు సదా సమ్మోదముల్ సన్నతుల్
విద్యా మూర్తి యటన్న సన్నుతులు విన్పించున్ ప్రపంచంబునన్.

అనవద్యమ్మనివార్య మద్భుత మనన్యంబైన అమ్మల్ల యో
ధుని నైపుణ్యము నెంచి కాంచి విని మిత్రుల్ శత్రులుద్యత్పునః
పునరాస్ఫాలన బాహుదండ నినదంబుల్ రేగి మార్మ్రోగగా
అనుమోదింతు రశాంతి గాంతు రెదలం దాహాలు హాహాలతో.

ఈ చాతుర్యమ్ము మెచ్చుకొ దగును గాదె నిల్చుచొ గెల్చుచొ
డాచేయే సరిపోవ నెందెదురు జెండా లేదు చిత్రమ్ముగా
'పేచీ' వేయును 'తోడు' చేయును మహావీరుండు మల్ల ప్రభుం
డాచార్య ప్రియశిష్యు డాతడు కళా హార్యుడు డెల్లప్పుడున్

ఛందో మార్గమువోలె సుస్థిరము పూజ్యంబైన తత్సద్యశ
స్సందోహమ్ము వెలుంగ నాటిన జయ స్తంభమ్ములా శాంతముల్.
సందేశించిన గాథలెల్ల నిలుచున్ స్వర్ణాక్షర శ్రేణితో
హిందూదేశ చరిత్రలో యుగ యుగధ్యేయ ప్రకాశమ్ములై.

వీరమణి వాడు నిజ కీర్తి విక్రమములు
ఐక్య విస్ఫూర్తి విస్తృతాధిక్య పూర్తి
ధవళ పాటల కాంతి కాంతములు సేయు
పాటవము తోడ ఒక రెప్ప పాటు లోన.

కర్కశతా దృఢత్వ బహుకర్మ సహత్వ జితశ్రమత్వ తే
జోర్క సమత్వ సత్వ సుమహత్వము లెల్ల మహాస్థిరత్వ సం
పర్కముచే పవిత్రములు ప్రస్తుతి పాత్రములీ సమస్తమున్
తర్కము లేని కష్ట ఫలితమ్ములు ఘోరతపః ప్రభావముల్.

పరమ పావన మీ మహా పాఠశాల
ఆ మహాబాహులెల్ల విద్యార్థులొక్క !
జాతి గౌరవమునకు ఆశా పథమ్ము
ఒక మహా కేంద్రమది మహాభ్యుదయ పదము.



# తుంగభద్ర ప్రాజెక్టు

తుంగభద్ర నీటిని రాయలసీమ ప్రజలకందుబాటులోనికి తెచ్చి సంతత క్షామబాధనుండి వారికి విముక్తి కలిగించాలనే ఆలోచన నీటి పారుదల సౌకర్యాల విషయంలో ఇంద్రజాలం చేసిన సర్ ఆర్థర్ కాటన్‌కి కలిగినది. ఈ ప్రాజెక్టు ప్రధానంగా బళ్లారి, అనంతపురం, కడప, కర్నూలు, రాయచూరు జిల్లాల ప్రజలకై వుద్దేశించబడినది. దత్తమండలాలుగా ప్రసిద్ధి కెక్కిన మొదటి నాలుగు జిల్లాలు మద్రాసు ప్రెసిడెన్సీలో భాగంగానూ, రాయచూరు హైద్రాబాదు సంస్థానంలో భాగంగాను ఉండేవి. 1953 అక్టోబరు 1 న ఆంధ్రరాష్ట్రం యేర్పడ్డంతో, దత్తమండలాలలో యెక్కువ భాగం అనగా అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలు, బళ్లారి జిల్లాలో మూడుతాలూకాలు ఆంధ్ర రాష్ట్రానికి రాగా బళ్లారి జిల్లా మైసూరుకు వెళ్లినది. 1956 నవంబరు 1న రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణతో గద్వాల, అలంపురం తాలూకాలు మినహా రాయచూరు జిల్లా మైసూరు రాష్ట్రంలో కలిసినది. ఈ రెండు తాలూకాలు ఆంధ్రప్రదేశ్‌లో లీనమైనవి.

తుంగభద్రా ప్రాజెక్టు, మద్రాసు, హైదరాబాదు ప్రభుత్వాల సమిష్టి కృషిగా 28-2-1945 న లాంఛనంగా ప్రారంభమైనది. 1-10-1953 తరువాత అది ఆంధ్ర, హైదరాబాదు, మైసూరు ప్రభుత్వాలచే కొనసాగించబడినది. 1-11-56 నుంచి దాని బాధ్యతను ఆంధ్రప్రదేశ్, మైసూరు ప్రభుత్వాలు రెండూ వహిస్తున్నవి.

తుంగభద్రా ప్రాజెక్టు యుద్ధానంతర అభివృద్ధి పథకంగా ఆరంభమైనది. అటు పిమ్మట అది తొలి ద్వితీయ పంచవర్ష ప్రణాళికల క్రిందకు వచ్చినది. అది తొలి ప్రణాళికలో కొంత అమలు జరిగినది. ద్వితీయ ప్రణాళిక ఆఖరుకి ప్రాజెక్టు తొలి దశ అభివృద్ధి పూర్తి అయినది. రెండవ దశలో ఎగువ కాలువ, కుడి వైపున అదనపు విద్యుచ్ఛక్తి వుత్పత్తి, ఎడమ పార్శ్వాన అదనపు విద్యుదుత్పత్తి కేంద్రాల నిర్మాణం చేరి వున్నవి. ఇవి తృతీయ ప్రణాళిక కాలంలో పూర్తి కావచ్చు. అయితే ఒకటి; యీ పథకం సర్వవిధాలా పూర్తి కాకపోయినా యిందుకు సంబంధించిన ప్రజలకు మొదటినుంచి కూడా తగినంత లాభం కలుగుతున్నది.

*నది* : ఈ నది మొత్తం ఆరగాణి (కాచ్‌మెంట్) 26,856 చదరపుమైళ్లు. మల్లాపురం వద్ద అది 10,880 చ. మై. ఇది జీవనది అయినా, వర్షపు నీరు యెక్కువగా లభించినా వేసవిలో దీని ప్రవాహం 100-50 క్యూసెక్కులకు తగ్గిపోతూ వుండేది. తుంగభద్రకు పెద్ద వుపనదు లేమీ లేవు. చిన్న వాటిలో చెప్పుకోతగినవి: వరద, వేదవతి లేక హగరి, హంద్రి. మొదటిది మల్లాపురానికి పైన, మిగిలిన రెండు మల్లాపురానికి దిగువ యీనదిలో కలుస్తవి. ఈ నది ఆగ్నేయ ఋతుపవన వర్షాలు కురిసే ప్రదేశం గుండా ప్రవహిస్తూ ఘాట్లలోగల అడవి, కొండ ప్రాంతపు ఆరగాకి నుంచి పుష్కలంగా నీటిని పొందుతుంది. వేసవిలో మాత్రం యిది బాగా యెండిపోయి చాలచోట్ల దాటుటకు వీలుగా వుంటుంది. ఆరగాణిలో లభించే నీటి గరిష్ఠ ప్రమాణం 139 లక్షల యెకరా అడుగులు, కనీస ప్రమాణం 68.2 లక్షల యెకరా అడుగులు అని అంచనా. వాటి సగటు 93 లక్షల యెకరా అడుగులు. ఆరగాణి సగటు వర్షపాతం 41 అంగుళాలు. ఘాట్లలో వర్షపాతం గరిష్ఠ ప్రమాణం 170 అంగుళాలు. మైదానాలలో కనీస ప్రమాణం 20 అంగుళాలు.

*ముఖ్యాంశాలు* : తుంగభద్రా ప్రాజెక్టు పథకంలో దిగువవి ఉన్నవి :

1. ఆనకట్ట.

2. కుడికాలువ—బళ్లారి, కర్నూలు జిల్లాల్లో 217 మైళ్ల పొడవున ప్రవహిస్తుంది.

3. ఎడమ కాలువ—రాయచూరు జిల్లాలో 127 మైళ్ల పొడవున ప్రవహిస్తుంది.

4. ఈ కాలువల నుండి పొలాలకు పంట కాలువలు.

5. ఆనకట్టవద్ద, కాలువలపై వివిధ ప్రదేశాలలోను విద్యుచ్ఛక్తి వుత్పత్తి.

ఆనకట్ట మధ్యరకం స్ట్రైట్ గ్రావిటీ రకం. దీనిలో మూడు విభాగాలున్నవి:

1. ప్రధాన ఆనకట్ట-ఇది నదిలో 5712 అడుగుల పొడుగున రాతితో నిర్మించబడుతుంది. ఇందులో మధ్యభాగంలో 2300 అ. పొడవున స్పిల్ వే వుంటుంది. ఎడమ చివర 267 అ. కాంపోజిట్ ఆనకట్ట వుంటుంది.

2. 500 అ. పొడవుగల మట్టి ఆనకట్ట-ప్రధాన ఆనకట్ట యెడమ ప్రక్కన గల కొండలో చిన్న వివరమును మూయుటకు.

3. బాగా యెడమ పక్కన 1527 అ. పొడవుగల కాంపోజిట్ ఆనకట్ట.

ఆనకట్ట గరిష్ఠపు యెత్తు 162 అడుగులు. పునాదిపై ఆనకట్ట వెడల్పు 93-50 అ. ఇది పైకి వెళ్లినకొలదీ క్రమేపీ సన్నగిలి చివర 22 అ. వెడల్పుగల రోడ్డు మార్గంగా మారుతుంది. ఈ ఆనకట్ట మొత్తం ఖర్చు రూ. 16,95,97,000.

*జల విద్యుచ్ఛక్తి పథకం:* తుంగభద్రా ప్రాజెక్టు ప్రధానంగా నీటిపారుదలకే వుద్దేశించబడినా దాని క్రింద విద్యుచ్ఛక్తికూడ వుత్పత్తి కాగలదు. దీని క్రింద మొత్తం 172500 కె. వా. విద్యుచ్ఛక్తి వుత్పత్తి కాగలదని అంచనా.

*కుడికాలువ:* ఈ కాలువలో మొదటి 14 మైళ్లకి విద్యుచ్ఛక్తి కాలువ అని పేరు. ఈ భాగంలో ఆయకట్టుకి రాయ, బసవన్న కాలువలద్వారా యిదివరకే నీరు లభిస్తున్నది. విద్యుదుత్పత్తి కేంద్రంనుంచి ప్రవహించే "టెయిల్‌రేస్‌పాండ్" జలం విద్యుచ్ఛక్తి కాలువలోని విభాగానికి మొదలు అవుతున్నది.

గుండలకేరి లోయ దాటిన పిమ్మట యీ కాలువకు "దిగువ మట్టం కాలువ" అని పేరు. ఇది మొదటి ఆరుమైళ్లలోనూ ఎత్తైన గుట్టలను, లోతైన లోయలను దాటుతుంది. ఎడమవైపున రమారమి ఒక మైలు దూరం కొండవాలు నానుకొని ప్రవహిస్తుంది. తరువాత అందమైన కాంక్రీటు అక్విడెక్టులద్వారా లోతైన రెండు కనుమలను దాటుతుంది. చివరికి యెత్తైన గుట్టను ఒక సొరంగం ద్వారా దాటుతుంది. ఈ సొరంగానికి "రామసాగర సొరంగం" అని పేరు. దీని పొడవు 1106 అ.లు. మిక్కిలి ముఖ్యమైన పెద్ద పని హగరి నదిపై 75వ మైలు వద్ద నిర్మితమయే అక్విడెట్టు. ఈ కాలువకు సంబంధించిన ముఖ్యాంశాలు:—

| | |
|---|---|
| అఫ్‌టేక్‌సిల్ లెవెల్ | .... ప్లస్ 1550.00 |
| 14వ. మైలువరకుప్రవాహం | .... 2500 క్యూసెక్కులు (విద్యుచ్ఛక్తి) |
| 14వ. మైలు తరువాత | .... 1800 క్యూసెక్కులు (నీటిపారుదల) |
| గర్భం వెడల్పు | .... 72 అ. |
| ప్రవాహంలోతు | .... 10 అ. 6 అం. |
| ప్రవాహ వేగం | .... సెకనుకి 3 అ. |

"విద్యుచ్ఛక్తి కాలువ", "దిగువ మట్టం కాలువ"ల మొత్తం ఖర్చు వరుసగా రూ. 1,31,70,000, రూ. 8,69,18,000.

*ఎడమ కాలువ:* ప్రధాన కాలువ పొడవు 127 మైళ్లు. ఇది మొదటి 19 మైళ్లు మహా విషమమైన ప్రదేశం గుండా ప్రవహిస్తుంది. ఈ ప్రదేశం విజయనగర సామ్రాజ్యపు స్మృతి చిహ్నలతో నిండి వుంటుంది. ఇక్కడ యీ కాలువ కొండల వరుసలను ఛేదించుకొని మూడు వుపజలాశయాలద్వారా ప్రవహిస్తుంది. ఈ జలాశయాలలో ఒకటి శివపురం వద్ద, మిగిలిన రెండు కానపురం వద్ద వున్నవి. ఇవి 90 అ., 84 అ. ఎత్తుగల రాతి ఆనకట్టలు, కాంపోజిట్ ఆనకట్టల వల్ల వరుసగా 9,14,15 వ మైలు వద్ద ఏర్పడినవి. ఆఖరికి యిది 3,557 అ. పొడవు, 22 అ. వెడల్పు, 19 అ. లోతుగల సొరంగం ద్వారా ఆఖరి కొండల వరుసను దాటి దాని 22వ మైలు వద్ద మామూలు ప్రదేశంలో ప్రవేశిస్తుంది. ఈ కాలువ తొలి విభాగంలో అనగా 15వ మైలు వరకు, విద్యుచ్ఛక్తి వుత్పత్తికై 7000 క్యూసెక్కుల నీరు వుంటుంది. అటు తరువాత నీటి పారుదలకై దానిలో 3100 క్యూసెక్కుల నీరు ప్రవహిస్తుంది. మిగిలిన నీరు నది దిగువ ప్రాంతాల వుపయోగానికై నదిలో ఒదిలివేయబడుతుంది. ఆ తరువాత యీ కాలువ యెక్కువగా సమతల ప్రదేశంలో ప్రవహిస్తుంది. ఇది మొత్తంమీద 114 ప్రవాహాలను, తగిన సాధనాల ద్వారా దాటుతుంది. వీటిలో 3 జలాశయాలు, 19 అక్విడెక్టులు, 73 కాల్వ వంతెనలు మున్నగునవి కలవు. వీటన్నిటిలోకి ముఖ్యమైనది 69వ మైలువద్ద 7 నిర్గమన ద్వారాలు (ఒక్కొక్కటి 60 అ. బై 21.17 అ.) మస్కి అక్విడెక్టు.

ప్రధాన కాలువకు పొడుగునా అంచు కట్టబడుతుంది. ఇందువల్ల నిర్వహణ ఖర్చు తగ్గటమేకాక కలుపు మొక్కల బాధ

మున్నగు సమస్యలు తలయెత్తవు. ఈ కాలువ 24వ మైలువద్ద నుంచి పడవ ప్రయాణాలకు కూడ వుపకరిస్తుంది. అందువల్ల యీ విభాగంలో బల్ల వంతెనలు అందుకనుగుణంగా నిర్మింపబడగలవు. రోడ్డు క్రాసింగులు కల చోకెల్లా రేవులు నిర్మించబడినవి.

*ఈ కాలువ ముఖ్యాంశాలు :*

| | | |
|---|---|---|
| 15 వ. మైలువరకు ప్రవాహం | .... | 7000 క్యూసెక్కులు (విద్యుచ్ఛక్తి) |
| 15 వ. మైలు కాలవ | .... | 3100 క్యూసెక్కులు (నీటి పారుదల) |
| గర్భం వెడల్పు | .... | 84 అ. |
| ప్రవాహం లోతు | .... | 14 అ. |
| ప్రవాహ వేగం | .... | సెకనుకి 4.5 |

ఈ కాలువ మొత్తం ఖర్చు రూ. 22,87,93,000

*పంపిణీ కాలువలు :* కుడికాలువ 203వ మైలుకావల కర్నూలు శాఖ అని వ్యవహరించబడుతుంది. ఈ కర్నూలు శాఖ కాలువ పొడవు 30 మైళ్లు. పెద్ద కాలువలు, పిల్లకాలువలు, పంటకాలువల మొత్తం నిడివి వరుసగా 194 మై., 740 మై., 2610 మై. వుంటుంది. కుడివైపున వుండే ఈ కాలువల మొత్తం ఖర్చు రూ. 1,43,00,000.

ఎడమ కాలువనుంచి దాదాపు 100 కాలువలు బయలుదేరుతవి. పెద్ద కాలువలు, పిల్ల కాలువలు, పంట కాలువలు కలిసి మొత్తం దాదాపు 1,000 మైళ్ల నిడివి వుండగలవు. ఈ కాలువలన్నిటికి మొత్తం రూ. 3,44,46,000లు ఖర్చు కాగలవు.

*ఎగువ కాలువ పథకం :* బళ్లారి, కడప, అనంతపురం జిల్లాల్లోని విస్తృత ప్రదేశాలను కరువునుంచి కాపాడుటకై తుంగభద్ర ఎగువకాలువ వుద్దేశించబడినది. ఈ ప్రాంతానికి ఈ నదీ జలం ప్రాణతుల్యమైనందున యిది తుంగభద్రా ప్రాజెక్టు పథకంలో ప్రధానపాత్ర వహిస్తుంది.

ఇది జలాశయంనుంచి మిక్కిలి యెత్తునుంచి (ప్లస్) 1585 అనగా దిగువ మట్టం కాలువ కంటే 35 అడుగుల (ఎత్తు) నుంచి బయలుదేరి బళ్లారి జిల్లాగుండా ప్రవహించి హగరి లోయను ఒక అక్విడెక్టు ద్వారా దాటుతుంది. హగరి నదిని దాటిన పిమ్మట కొంత దూరం కాంటూరు కాలువగా ప్రవహించి తరువాత 1. గుంటకల్ బ్రాంచి, 2 పెన్నారు బ్రాంచి, అని రెండు శాఖలుగా చీలుతుంది. పెన్నారు శాఖ అరవకొండ గుండా ప్రవహించి పెన్నారు నదిలో కలుస్తుంది. ఎగువ కాలువకు పెన్నారు నదిపై ఒక రెగ్యులేటర్ ఉన్నది. మధ్య పెన్నారు రెగ్యులేటర్ అనబడు దీనికి యిరు పార్శ్వాల కాలువలున్నవి. అదే పెన్నారు నదిపై యింకా దిగువ గండికోట అడ్డకట్ట వుంటుంది. దాని కిరువైపుల వుండు కాలువలకు ఉత్తర కడప. దక్షిణ కడప కాలువ అని పేరు.

ఈ ఎగువ కాలువలో నీరు సంవత్సరంలో కొన్ని నెలలు మాత్రమే వుంటుంది. జూన్ నుంచి నవంబరు వరకు మొత్తం 5 నెలలు తుం. భ. జలాశయం నుంచి దీనికి మొత్తం 50,000 మి. ఘ. అ. నీరు లభిస్తుంది.

ఈ ఎగువ కాలువ నీటిని మైసూరు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు, వాటి మధ్య జరిగిన ఒప్పందం ప్రకారం 35 : 65 నిష్పత్తిలో పంచుకోవాలి. ఈ కాలువ 68 మైళ్లు మైసూరు రాష్ట్రంలోనూ, మిగిలిన 54 మైళ్లు ఆంధ్రప్రదేశ్‌లోను ప్రవహిస్తుంది.

ఈ పథకాన్ని మూడు సంస్థలు అమలు పరుస్తున్నవి. వివరాలు యివి :

1. *తుం.భ.బోర్డు :* 68 వ మైలువరకు మొత్తం ప్రధానకాలువ.

2. *మైసూరు ప్రభుత్వం :* మైసూరు రాష్ట్రం క్రిందకు వచ్చే పంపిణీకాలువలు, ఆయకట్టు అభివృద్ధి పనులు;

3. *ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం :* ప్రధాన కాలువ, 68వ మైలు కావల ఎగువ కాలువ పంపిణీకాలువల శాఖోపశాఖలు, ఆంధ్ర ప్రాంతంలో ఆయకట్టు అభివృద్ధి.

మొత్తం పథకానికి చివరికి రూ. 21 . 9 కోట్లు ఖర్చు కాగలవు. ఇది నిర్వహణ ప్రయోజనానికై రెండు భాగాలుగా విభజించబడినది. రూ. 13 కోట్లు ఖర్చు అయే మొదటి అంచె పథకం 1959 ఫిబ్రవరిలో మంజూరైనది. ఈ మొదటి అంచెలో ఎగువకాలువలో 23,000 క్యూసెక్కులు ప్రవహించే యేర్పాటు చేయబడుతుంది. ఆఖరి అంచెకి యీ ప్రవాహ పరిమాణం 4,000 క్యూసెక్కులు.

*ఆర్థిక ప్రయోజనాలు :* తుంగభద్రా ప్రాజెక్టు అన్ని భాగాలు పూర్తి అయిననాడు ఆహార ధాన్యాలు మొత్తం 5 . 73 లక్షల టన్నులు, వాణిజ్య పంటలు 9 . 18 లక్షల టన్నులు పండగలవు.

వాటి విలువ సంవత్సరానికి దాదాపు రూ. 39 కోట్లు వుండగలదు. ఇది దాదాపు 12.1 లక్షల యెకరాలకు నీటి పారుదల లభింప జేస్తుంది. ఎకరా ఖర్చు రూ. 618. దిగువ కాలువ. ఎడమ కాలువల క్రింద పరిమిత పథకం క్రింద యీ ఖర్చు రూ. 638. దీని క్రింద దాదాపు 172500 కె. వా. విద్యుచ్ఛక్తి కూడ వుత్పత్తి కాగలదు. ఇందులో 82000 కి. వా. ఫర్మ్, 134300 కి. వా. సీజనల్ పవర్. ఇందువల్ల యేటా మొత్తం రూ. 8.39 కోట్ల ఆదాయం రాగలదు. ఈ విధంగా నూరు కోట్లు ఖర్చు అయే తుం. భ. ప్రాజెక్టు అన్నివిధాలా పూర్తి అయిననాడు సాలుకి రూ. 21.39 కోట్ల ఆదాయాన్నిస్తుంది.

*తుంగభద్రా లోయ :* మన దేశంలో మానవ శ్రేయస్సుకై గరిష్ఠ ప్రమాణం నీరు వాడుకొనే యేకైక పెద్ద నది కావేరి అన్న విషయం సుప్రసిద్ధమే. ఆ నదీజలంలో నూటికి అయిదు వంతులు కూడా బంగాళా ఖాతానికి చేరవు. కావేరి నది కాక ఒక్క చుక్క నీటినికూడ సముద్రానికి పోనీయని మరి రెండు చిన్న నదులు— వైగై, తామ్రపర్ణి — మద్రాసు రాష్ట్రంలో ఉన్నవి. తుంగ ఆనకట్ట, భద్ర జలాశయం, తుం. భ. ప్రాజెక్టు, రాజోలిబండ ఆనకట్ట, కర్నూలు–కడప కాలువ మరమ్మతు పూర్తి అయిన పిమ్మట తుంగభద్ర జలాలలో 8 శాతానికి మించి దక్షిణాదిని రెండవ పెద్ద నదియయిన కృష్ణకు చేరవు. వాటి క్రింద ఆంధ్ర ప్రదేశ్, మైసూరు రాష్ట్రాలలో దాదాపు 20 లక్షల యెకరాలకు నీటి పారుదల లభిస్తుంది. 2,12,900 కె. వా. విద్యుచ్ఛక్తి లభిస్తుంది. ఈ విద్యుచ్ఛక్తి గృహ వ్యవసాయ ప్రయోజనాలకే కాక పారిశ్రామికాభివృద్ధికి కూడ తోడ్పడగలదు. క్లుప్తంగా యిదీ మొత్తం తుంగభద్రాలోయ అభివృద్ధి విషయం.

*అద్వితీయం :* ఈ ప్రాజెక్టులో అద్వితీయమైన లక్షణ మొకటున్నది: దీనికి సంబంధించిన సివిల్ పనులను మొదటి నుంచీ కూడా విదేశీయ నిపుణ సలహాలతో నిమిత్తం లేకుండా అచ్చగా భారతీయ ఇంజనీర్లే జరిపిస్తున్నారు. తక్కువ ఖర్చుతో అద్భుతమైన ఫలితాలు సాధించబడినవి.



# రమ - ఉమ

## 'వైశంపాయన'

(ఒకనాడు, ఉమను చూచేందుకు రమ కైలాసానికి వెళ్ళింది. ఆ సమయంలో పరమేశ్వరుడు లేడు. ఆ అవకాశం పురస్కరించుకొని వేళాకోళంగా–'వెళ్ళెనె బిచ్చగాడు?' అని ప్రశ్నించింది రమ. వారిద్దరికి ఈ క్రింది విధంగా సంభాషణ జరిగింది : )

'వెళ్ళెనె బిచ్చగాడు?' 'తఱి
వేచి బలీంద్రుని వేడనా–?' 'మగ
ళ్ళిళ్ళను లేని పొందిక గ్రహింపను'–
'గోపికలన్ గలంపనా ?'
'పల్లె పడంతికై శిరము వంపను–'
'చెంచుల వాడనా ?' యనన్,
గొల్లున నవ్వె నిందిర "తగున్
తగునే !" యని శైలకన్యతోన్.

# అరకులో అభ్యుదయం

జె. బాపురెడ్డి

సృష్టికర్త రచించినట్టి వి
శిష్ట కావ్య పరిమళమ్ముల్లు
అనుభవింపదలంచి నావా ?
అరకులోయకు కదలిపొమ్ము

భారతావనిలోన ఉప్పొం
గారు నవచైతన్య సంపద
అరసి మురియదలంచినావా ?
అరకు లోయను చూచిరమ్ము.

ప్రకృతి చేసిన తరతరాల త
పఃఫలమ్మా కొండదేశము
మన మహాత్ముని కలలు నిజమే
ననును ఆ గిరిజనవికాసము.

ఏ వనములందో వెలిగిపో
యే వసంతము మెల్ల మెల్లన
లేమి రేడేలు కొను గిరిజన
గ్రామములు దర్శింపసాగెను,

చీకటులు గూళ్లు కట్టిన గుడి
సెలందున వెలుతురులు చిమ్మెను,
కరువు బరువులు మోసివాడిన
గిరిజనుల బ్రతుకులు సుమించెను.

ఏమితోచక, కాలు నిల్వక,
ఎచటనో తిరుగు సెలయేరులు,
ఒక ప్రణాళిక వేసుకొని, క్షే
మకర మార్గము చూచుకొని, ఆ
క్షామ భూముల నేడు సస్య
శ్యామలము కావింపబోవును.

రకరకాల సుగంధ సుమములు
రమ్యమౌ రసభరిత ఫలములు
నిన్న మొన్నటిదాక మాడిన
మన్నులోనే పొంగివచ్చెను.

మున్ను ఇచ్చట తపము చేసిన
మునుల అంబరములను పోలిన
నేలలో వ్యవసాయ తపమున
నేడు పచ్చలు పండసాగెను,
గంజినీళ్లకులేని వారల
గరిసెలపుడే నిండసాగెను.

అచటి కొండల మహౌన్నత్యము
అచటి లోయల గభీరత్వము,
అచటి ప్రజల సదాశయములకు
అభ్యుదయ పథకాచరణలకు
లొంగిపోయి, ప్రజాప్రగతికై
మంగళాచరణమ్ము పాడును.

"పోడు" చేసి, అడవి సంపద
ప్రోగుచేసి, మోసగాండ్రౌ
షేరగాండ్రకు ధారపోసిన
బీదవారా కొండవాసులు,
తమ అవిద్య దరిద్రతలనే
క్రమయి జయింప సాగిరి.

గన్నెల గ్రామమున విద్యా
కల్పవృక్షము పాదుకొన్నది
నవసమాజ వికాస బీజము
నాటుకొన్నది పల్లె పల్లెను.

వారి "దిమ్సా" నాట్యములలో
వారి ఆటల పాటలందున
నిర్మలాత్మానందభావము
నిరాడంబర జీవితమ్ములు
ప్రకృతిపూజా ధర్మనిష్ఠలు
ప్రతిఫలించును, ఇంపు నించును.

బాటవెంబడి అడవులందున
పాటలల్లెడి పక్షిలోకము,
"రండి అరకును చూడరండ"ని
గుండియలు పులకించ పిల్చును
బయలు దేరుము మిత్రమా ! ఆ
భవ్య శోభలు చూడ నేడే.

★

# ప్రవరుని అకామత

బెల్లంకొండ రాఘవరావు

అల్లసాని పెద్దన రచించిన స్వారోచిష మనుసంభవము తెలుగు సాహిత్యములో ప్రశస్తికెక్కిన ప్రబంధము. దీనికి మూలకథ సంస్కృత మార్కండేయ పురాణము లోనిది. మూలమునందు కొద్దిగా నున్న కథను పెద్దన కథన వైపుల్యము చేతను వర్ణనా బాహుళ్యము చేతను ఆరు ఆశ్వాసముల ప్రబంధముగా తీర్చెను.

ఈ ప్రబంధములో మూడు ఘట్టములున్నవి. వరూధినీ ప్రవర ఘట్టమొకటి—మాయాప్రవర సమాగమముతో సహా స్వరోచి జననము, రాజ్య స్వీకారము, వేట, వివాహములు గార్హస్థ్యము మొదలగునవి రెండవ ఘట్టము—స్వరోచీ వనదేవతల సమాగమము—స్వారోచిష జననము, అతని తపస్సు, విష్ణువు ప్రత్యక్షమై అతనిని మనువుగా నియోగించుట మూడవ ఘట్టము.

కావ్య శిల్పమునకు వస్త్వైక్యము ఒక శోభావహమైన లక్షణము. అది ఇతి వృత్త సంబంధిగా నుండవచ్చును— కావ్యమునందు పర్యంతానుస్యూతమైన మహాభావ సంబంధిగా నుండవచ్చును. ఏకతా లక్షణమున్న కావ్యము సహృదయునికి చర్వణావిచ్ఛిన్నతను రస సమాధిని సమకూర్చును. కాని విభిన్నకథ లుండుట కావ్యమునకు దోసము మాత్రము కాదు. రఘువంశ కావ్యము దిలీపునితో ప్రారంభమై అగ్ని వర్ణునితో ముగియును—తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము నందును వేర్వేరు కథలు కలవు అట్టి ప్రతి కథయు ఒక ఖండ కావ్యముగా రాణించును. భారత భాగవతముల వేర్వేరు కథా ఘట్టములను చదివి మనము ఆనందించుచున్నాము.

శిల్పదృష్టితో చూచిన ఏ కావ్యమందైనను కథా శిల్పమునకు పోషకము అగత్యము కాని వర్ణనా బాహుళ్యము ఒక దోసమే. అట్టిది మన ప్రబంధములందు మెండుగా కలదని వేరుగ చెప్పనక్కరలేదు. ఆ కవులకు తమకున్న వివిధ విషయ పరిజ్ఞానమును, వర్ణనాశక్తిని ప్రదర్శించ వలయునన్న ఆసక్తియే ఆ కావ్యముల బలుపునకు కారణము. ఈ లక్షణము మన తెలుగు ప్రబంధములకు—ఈ మను సంభవమునకు గూడ—మిక్కిలిగా పట్టినది.

ఈ ప్రబంధమును "స్వారోచిషమనుసంభవమని" కవి పేర్కొనెను. కావున తొట్ట తొలుతనున్న వరూధినీ ప్రవర ఘట్టమునకును చిట్టచివరనున్న స్వారోచిషమను పట్టసిద్ధికిని కార్య కారణ సంబంధమును మనము గమనించ వలయును.

తొలి ఘట్టమున ప్రధానమైనవి మూడు పాత్రలు: వరూధిని, ప్రవరుడు, గంధర్వుడు. వరూధిని అప్సరస—భోగకాంత—"నన విల్తుశాస్త్రంపు మినుకు లావర్తించు పని వెన్నతోడ బెట్టినది మాకు; హయమేధ రాజసూయములని పేర్వడ్డ సవన తంత్రంబు లుంకువలు మాకు" అని వరూధిని ప్రవరునితో చెప్పెను— యజ్ఞ దీక్షితులగువారు మరణానంతరము దివ్య దేహములతో స్వర్గమును పొంది అచ్చటి సుఖములతోపాటు అప్సర సంభోగమును అనుభవింతురు. కాని ఈ స్వర్గ సుఖానుభవములు సకాములగు వారికి మాత్రమే—అనుభవానంతరము పుణ్యక్షయమై వారికి క్రిందికి రాక తప్పదు—నిష్కాములు బ్రాహ్మీ స్థితిని మాత్రమే ఆశింతురు— యజ్ఞదాన తపః కర్మలు ఆత్మశుద్ధికై అనుష్ఠింతురు—సంసార విముక్తియు బ్రహ్మ ప్రాప్తియు వారి లక్ష్యములు—"వాని చక్కదనము వైరాగ్యమున జేసి కాంక్షసేయు జారకామినులకు భోగబాహ్య మయ్యె" నని కవి మొదటనే చెప్పెను—ప్రవరునియందు పరమ వైరాగ్యమును నిరతిశయ తనూవిలాసమును గంగా యమునల వలె సంగమించినవి. ప్రవరుని ప్రవృత్తియందు ఒక్కటే లోపమున్నది. పుణ్యక్షేత్ర సందర్శనమునందు అతనికి మితిమీరిన కోరిక. సిద్ధునితో సంభాషించునప్పుడు అది సువ్యక్తమగును. కాని ప్రవరునికి అట్టియుబలాటము లేకుండిన కథా పర్యవసానములో స్వారోచిషునివంటివాడు పుట్టుటయు అతడు మనువగుటయు అసంభవము లని మున్ముందు మనము తెలిసికొందుము.

వరూధినీ ప్రవర సమావేశ ఘట్టము ఆంధ్ర సాహిత్యములో నొకశిల్ప రమణీయమైన "లిరిక్కు"—ఇందు రతినాయిక యందే నిష్ఠమగుటచే శృంగార రసము పరిణతి పొందక రసాభాసమైనది. ఒక రసము ఆభాసమైనప్పుడు అది రసాంతరముగా పరిణమించిననే సహృదయునికి సంవిద్విశ్రాంతి కలుగును. భారతమునందు కీచకనిష్ఠమైన శృంగారము ఆభాసమై భీమునియందు రౌద్రముగా

పర్యవసించును. అట్లే పై ఘట్టము నందును ప్రవరుడు నిష్క్రమించు నప్పుడు అద్భుతము ప్రతీత మగును. ద్వితీయాశ్వాసము చివరి వచనమును చూడుడు:—

"అని స్తుతించి అగ్నిదేవుండు అమ్మహీదేవు దేహంబున సన్నిహితుండగుటయు అమ్మహాభాగుండు గండు మీటి పొడుపు గొండ నఖండ సంధ్యారాగ ప్రభామండ లాంతర్గతుండగు పుండరీక వనబంధుండునుం బోలె నుత్తప్తకనకద్రవ ధారాగౌరంబగు తనుచ్ఛాయా పూరంబున నక్కాన వెలిగించుచు—పవన జవంబున నిజ మందిరంబున కరిగె"

తైత్తిరీయోపనిషత్తునందు మానుషానందము మొదలు బ్రహ్మానందము వరకు సోపాన క్రమముగను ఉత్తరోత్తర గరిష్ఠముగను వర్ణింప బడినది. ఈ యానంద పరంపర అకాముడైన శ్రోత్రియునికి నిత్యసిద్ధమని ఉపనిషత్తు ప్రతిపాదించు చున్నది. మానవ గంధర్వ దేవతాది గణములకు అనుభూత మగు ఆనందము అకాముడగు శ్రోత్రియునికి లభించు దానికన్న కనిష్ఠమైనది.

ప్రవరుడు అకామహతుడగు శ్రోత్రియుడు. నాతో రమించిన సశరీర స్వర్గ సుఖము నీకు దక్కునని వరూథిని యూరించి నప్పుడు ప్రవరుడు: "కాముకుడగు వానికి నీవన్న దంతయు నిజమే, కాని అకాముడు అట్టి సుఖము నాశింపడు" అని బదులు చెప్పెను.

"బ్రాహ్మణుకింద్రియ వశగతి
జిహ్మ చరణైక నిపుణ చిత్తజ నిశితా
జిహ్మగముల పాలై చెడు
బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుడై" అని తన పరమ లక్ష్యమును విశదీకరించెను. వరూధిని తత్తరపాటును చూచి "సిగ్గు వెగటును బొడమ నిస్పృహత దెలుపు నొక్క చిరునవ్వు నవ్వెను'; ఆమె మేని సోకున నంటుకొన్న జవ్వాది తావిపోవునట్లు కడిగికొని వార్చి అగ్నిదేవుని ప్రార్థించెను.

తరువాత తృతీయాశ్వాసములో గంధర్వుడు ప్రవేశించును. అతడంతకు మున్ను వరూథినిని కామించి హత్తక అనుకూల కాలమునకు వేచి యుండెను. అతడు అంగభవవిద్యా పారగుడు, అతడు ప్రవరుని వేసమూని వరూథినితో కొంతకాలము కామ సుఖము లనుభవించి ఆమె గర్భవతి యైనంత సామోక్తుల ఆమె సమ్మతిని వడసి వెడలి పోవును.

చతుర్థాశ్వాసము ప్రారంభమున సీసపద్యములో ఈ వాక్యము అర్థవంతమైనది: అపుడు తత్ప్రవరదేహ సమిద్ధ శిఖిదీప్తి శాంబరీ మహిమచే సంగ్రహించినట్టి గంధర్వమూర్తి సౌఖ్యానుభూతి చలన మేదిన మానసాబ్జమున నిలువ, వెలసె తేజోమయంబైన వృద్ధి నట్టి మేటి గర్భంబు, గంధర్వుడు ప్రవరుడగుట పట్టి పగటి వేసము వేసికొనుట వంటిది కాదు. ప్రవరుని దేహమున వెలుగు "శిఖిదీప్తిని" తన మాయా మహిమచే గంధర్వుడు ఆకర్షించెను. అట్టి సమగ్ర ప్రవర లక్షణముతో గంధర్వుడు సంభోగించు నప్పుడు వరూధిని ఆ ప్రవరాకృతినే తన నిశ్చల హృదయ ఫలకముపై నిలుపుకొన్నది. కావుననే "అట్టి మేటిగర్భంబు తేజోమయంబైన వృద్ధి వెలసె" నన్నాడు కవి.

వరూథినికి స్వరోచి జన్మించినాడు. స్వరోచియందు గంధర్వునికి చెందిన రజోగుణము ప్రస్ఫుటముగను, ప్రవరునికి చెందిన సత్వగుణము గుప్తముగను నెలకొన్నవి. తరువాత కథలో స్వరోచి రాజ్యము నేలుట, వేటకు పోవుట, మువ్వురు కాంతల వివాహమాడుట, వారితో చిరకాలము రతిసుఖము ననుభవించుట జరుగును. అతని భోగలాలసనుచూచి ఒక చక్రవాకియు మగ లేడియు అపహాస్యము చేయగా విరక్తి కలిగియు మరికొంత కాలము సంసారము నందుండి పుత్రులను పడయును. అనంతరము స్వరోచికి వనదేవత సాక్షాత్కరించి రతి నపేక్షించును. "నేను వనదేవతను, నీవలన మనువు కాదగిన పుత్రుని కనుమని దేవతలు ఆదేశింపగా వచ్చితి" నని చెప్పును. వారి కూటమివలన స్వారోచిషుడు జన్మించును.

"అట్లు జనియించి స్వారోచిషాఖ్యు నతడు
శాంతి దాంతి దయా సత్య శౌచనిరతు
డై; యకామత జిరతపం బాచరించె
నచ్యుతునిగూర్చి" ;;

అంత విష్ణువు అతని తపస్సుకు మెచ్చి ప్రత్యక్ష మగును. వరము వేడుమన స్వారోచిషుడు విష్ణు సాలోక్యము నర్థించును. "ముందు ద్వితీయ మనుపట్టము గ్రహించి ధర్మ పరిపాలనము నిర్వహింపుము. చివరకు నీకు నాతో సాలోక్యము సిద్ధించును" అని విష్ణువు అనుగ్రహించును.

కావున ప్రవరుని "అకామత" వరూథినీ గర్భ ద్వారమున స్వరోచికి సంక్రమించి గుప్తముగా నుండి స్వారోచిషునియందు అభివ్యక్తమైనది. ఈ ప్రబంధము నందలి సారార్థము "అకామతా" ప్రభావము, ప్రవరుని "అకామతకు" చ్యుతి కలుగకుండ స్వారోచిష ముఖముగా లోక సంగ్రహమునకు వినియుక్త మగుటయే ఇందలి విశిష్టత.



# శౌర్య జ్యోతి

ఉప్పాడ రాజారావు

(బిందుసార కుమారుఁడు కళింగదేశ జిగీషమై దండెత్తి వచ్చిన, కళింగ నరపాలుఁడు కరండబాహు కారవేలుఁడు చిల్కాసరోవర తీరమున నాతని నెదుర్కొనెను. పక్షము దినముల నిశ్చితమగు ఘోర యుద్ధము జరిగెను. సామపభూపాలుడగు హంసదేవుని స్వామిద్రోహమున మాగధులు కాళింగ రాజేంద్రుని సపుత్రకముగ నర్ధరాత్రమున వధించిరి. యుద్ధరంగ మనుకూలముగ మారుటచే కళింగ సైన్యములను చెల్లా చెదరు గావించి మగధ సేనలు దంతపురమును లోఁగొన బయలు వెడలెను. మహారాజ్ఞి సుమిత్రాదేవి చార ముఖమున యుద్ధవార్త లరసి దేశరక్షా దీక్షితయై మూలబలమ్మును పౌరజానపద వనితా జనతా దళమ్ములను గూర్చుకొని మగధ వాహినీ పరంపర నెదుర్కొన మహేంద్రనగర ప్రాంతమును జేరెను.)

వేగరులేగుదెంచి "పర వీరసమూహము విక్రమించి, సై
న్యాగమనమ్ముఁ దెల్పు కబురందకమున్ మనసేనఁగూల్చి ది
గ్భాగము గార్చుక్రమ్మ శలభప్రకరంబులఁ బోలె రాజధా
నీ గజనాశనేచ్ఛ జననీ! పరతెంచుచు నుండి" రంచనన్.

కింకర్తవ్యవిమూఢయై విజయలక్ష్మి వీక్షణప్రాప్తి యా
శంకాపాత్రముగా నెఱింగి హృదయ స్వాస్థ్యంబుఁ గోల్పోక బా
ష్పాంకూరమ్ములు గండ్లనింకఁగ మనోవ్యాఘాతమున్ మాన్చి య
ప్పంకేజాక్షి సుమిత్ర సంప్రతుల నాహ్వానించె యోజింపఁగన్.

విబుధుల సూచనన్ నిజపవిత్రి కళింగము ముక్కడీంద్ర వే
డబమునఁ జిక్కనీయమి నెడందనుగోరుచు రాజపుత్రి సిం
హబలను సంధిసేయ మగధాధిపుసన్నిధిఁ జేరఁబంచె ధీ
ప్రబల సుమిత్రరాజ్ఞి సమర ప్రతిరోధక యత్నశీలయై.

శూరవేషముధరియించి సూత్రజాత । రాజసుతసల్పె రాయబారమును మగధు
నెలవునకుఁ బోయి; యద్దాన ఫలములేక । మరలెస్వాతంత్ర్య మతములు దొరఁగఁజుం.

పారతంత్ర్యము ధర్మవిభ్రంశము నొడ । గూర్పఁబూనిన వైరిఁ బైకొని జయమ్ము
గొనుటయో వీరమరణము గనుటయొ తన । ధర్మమని రాణికడఁగె యుద్ధమునకంత.

చారులఁబంచి శాత్రవుల జాడలెఱుంగుచు నాయుధాదులన్
గూరుప శ్రద్ధఁగొంచు బలకోశసమృద్ధిని సంతరించుచున్
వీరకథాప్రచారముఁ బవిత్రమతోద్ధరణైక దీక్షయున్
బేరిమిఁ గీలుకొల్పుచు సుమిత్ర బలంబుల దిద్దఁబాల్పడెన్.

మగధబలమ్ములు దలఁచెను । మగువలబలమెంత? నిమిషమాత్రములోనన్
దెగనఱకి పోవనగునని; । పగతుల గుదిబండయయ్యెఁ బ్రమదాసేనల్.

బిందుసారతనూజుఁడు నందుజేరెఁ । బదిదినమ్ములలో; నిరుపక్షములకు
నంతఁజెలరేగెఁ బోరుభయంకరముగ । మొండెములు వ్రాలెఁ దండోపతండములయి.

అహితులకును మదవతుల । య్యహిరాజకరాళదంష్ట్రలై సాంద్రవనీ
దహనుని జిహ్వాలయి భయా । వహలై రి ద్రవించినట్టి జ్వాలాముఖలై.

జ్వాలాజిహ్వుని డాసి కూలు శలభవ్రాతంబునా వీరు లీ
నేలన్ వ్రాలుటఁ గాంచి సంగరకలానిర్ణిద్రవిద్రావణ
స్త్రీలోకంబునఁ జిక్కి జీవితము నిశ్శేషంబుగా నుండెగాఁ
గాలంబెట్టుల మీఱవచ్చునని దుఃఖంబొందె నమ్మౌర్యుఁడున్.

అశ్వవాలద్యుతినలరు నింద్రాయుధ పల్యాణమున రీవి ప్రబలనెక్కి
వామహస్తమున దీవ్యత్ఖలీనమ్మును గుడికేలఁ గుంతము కొమరు మీఱఁ
జిత్రాయ సోత్తమాంగత్రాణ వర్మముల్ ధరియించి కటి నసి వరము వ్రేల
మల్లికాక్షమ్మునా రోహించి యంగరక్షకులు పార్శ్వాళిఁ గొలువఁ

గదనరంగమునందు విక్రమముమూర్తిఁ గొన్న యాఁకొన్న బెబ్బులి గున్నలీల
వైరి పరిదేవనముగూర్చె ధీరచరిత, రాజరాజేశ్వరి సుమిత్ర తేజ మొలయ.

ఛాత్రపురీధ్వంస సంగ్రామకుశలత కిష్టబహుళాకృతియేయుఁడనుచు
నౌకాసమూహ వినాశన పౌరుష సమ్మానముగఁ గిట్టి చంపుఁడనుచు
ధర్మంబుఁదొఱఁగి నిద్రామగ్నులను గూల్చు । శూర సత్కృతిఁ దెగఁ జూడుఁడనుచుఁ
గాలిడు చోటులఁ గంకాళరాశులఁ గూర్చు ధార్మికవృత్తిఁ గూల్చుఁడనుచు

పాడిపంటలు మాపి సౌభాగ్యనిలయ జనపదంబుల ఘోర శ్మశానములుగఁ
జలుపుసౌజన్యమును నేలఁజదుపుఁడనుచు । రాణి చెలరేగె వైరి విద్రావణముగ.

ఇరుమూడు దినములీక్రియ, నరివిధ్వంసనము బరిగె, నా ప్రొద్దున న
ద్ధరణీవరుఁ దాఁకెను దుస్తర పౌరుషవార్ధి సూత్రజాత కడంకన్.

శోణవిక్రాంతి నిస్త్రింశపాణి రాకుమారి ధారాప్రదేశ విహారము పర
వీరతండముఁ బొరిగొనె మారిమసఁగు పోల్కి పీనుఁగుపెంట లప్పొలమునిండ.

సేనలపాటుఁగాంచి నృపసింహుడు నివ్వెఱపోయి "శూర స
మ్మానబలీ! పరాక్రమ మమానుష" మంచుఁ బ్రశంస సల్పి, యు
మ్మానవతీ ప్రతాపమును మాపఁగ రేచితమల్లి కాతమున్
బో నియమించి తాఁకె స్ఫుటభోగసముద్ధతనాగసన్నిభన్.

నృపుఁ డవ్వీరకుమారిఁ దాఁక మగధానీకంబు సోత్సాహమై
రిపుసంత్రాసకమయ్యె; ముమ్మరము దుర్వీక్ష్యంబునై పోరితం
బపరాహ్ణంబునసాగె; నయ్యెడఁ గళింగాధీశు సత్పుత్రి శౌ
ర్యపరాకాష్ఠను బొంది నెత్తురులు పాఱం జేసె యుద్ధావనిన్.

దేవానాంప్రియుఁ డిమ్మహామహిళపైఁ దేజంబు సూపింప రో
షావిర్భూత సరూక్షవీక్షణలఁ దీవ్రార్చుల్ బ్రసారించుచున్
భ్రూవిక్షేపముతోడఁ బార్శ్వచరులన్ బ్రోత్సాహమున్ జల్పి శి
క్షావైశద్యముఁ జూపెఁ బోరునఁ బ్రతీకారేచ్ఛపైఁ గ్రమ్మఁగన్.

(శ్రీ) వృతుకిఁ బ్లుతగతి, నద్ధి విలసిత పంచి ఖడ్గదీప్తులు గ్రమ్మన్
భూవిభుకృపీట పార్శ్వము నోవఁ గాటముగ నేసె నూల్కొను గినుకన్.

మౌర్యుఁడు హేతిపాతములు మర్మము నాటఁగ శోషఁగొన్న న
య్యార్యను మంది కయ్యమున నందఱుఁ గ్రమ్మిరి వాహినీపతుల్;
ధైర్యము చెంగలింప వసుధాపతిపుత్రి కృపీటయోని ని
ర్వీర్య తృణంబుఁగాల్చు క్రియ వీరవిహారము సల్పె నత్తఱిన్.

"వృకసంఘంబునఁజిక్కు నొందె మన పృథ్వీనాథు సత్పుత్రి, యిం
చుక జాగౌనెడఁబుట్టి మున్గు" నని రేచుల్ గ్రమ్మ గ్రావంబునాఁ
బ్రకటక్షాత్రము వెల్లిఁగొల్పు వనితారక్షార్థులై సైనిక
ప్రకరంబయ్యెడ మూఁగి మాగధులఁ జంపం జొచ్చి రొక్కుమ్మడిన్.

డుల్లినశిరములు నెత్తురుఁ జల్లెడి మొండెములు భిన్నశాతాసి గదా
ఖల్ల సముదయము రక్తపు వెల్లువ పెల్లయ్యె జోడువేడెంబంతన్.

అత్తరి సూత్రజాత రిపులార్వఁగ వ్రేటున కేవ్రరేసి యో
ధోత్తము లుర్విఁ వ్రాల విలయోద్ధతిఁ ద్రుంచుచు విక్రమించుడున్
గత్తిళ మొక్కఁడశ్వము నొకండును జీల్పఁగ నామెవైరి రా
హుత్తునుగూల్చి తద్దరి ముహూర్తము లోపల నెక్కె నుక్కునన్.

"చిచ్చుఱ పిడుగనా రిపులఁజీరి యెనర్పక రౌద్రమూర్తియై
వచ్చుచునుండె రాణి; పొదువందగు, రం;" దని మాగధావళిన్
హెచ్చరికల్ సెలంగగ మహీపతి పుత్రి కృపాణ ఖేలనన్
బుచ్చె నసంఖ్యలన్ యముని ప్రోలికి హెచ్చిన యుత్సవంబునన్.

'అగ్గికి గాలితోడయిన నార్పనశక్యము; కాంతయొక్క తే
యగ్గలమైన ఘోరసమరాంగణమున్ విడనాడి పోవు టే
లగ్గగు; విక్రమించి జయలక్ష్మిని జేకొనకున్నఁ జేతులన్
కగ్గినయాయుధంబు లవి కల్గి ప్రయోజనమేమి ? రండహో!"

అనెడి దళవాయి నుడువుల నాలకించి మగధసేనలు రాజకుమారిఁబోదివి
పురిఁగొనిన పౌరుషంబునఁ బొలఁతిపార్శ్వ చరులఁ దునిమిరి సంకుల సమరమందు.

ఖేటక ఖేంకాణములన్, దూటువడన్ నేలఁగూల్చి తొయ్యలిపై నా
ఖేటకులు వోలెఁ గ్రమ్మిరి, కూటాహావ వృత్తి వంచకులు దుర్ణయులై.

ఖడ్గమాత్ర సహాయయై కలికిమిన్న, యందరకు నన్నిరూపులై యాహవమ్మ
సల్పిరుధిరస్రవంతుల స్నానమాడి, జీవదానముసల్పె దుర్జేతృఘనత.

ఆత్మదేశ స్వతంత్రత నభిలషించి, సకలమర్పించి కీర్తిదీపికను నిలుపు
సూత్రజాత కుమారి విశ్రుతచరితము, మానినీలోకమకుటాయ మానమయ్యె.



కథానిక:

# పాడిగేత

తాళ్లూరు నాగేశ్వరరావు

చింతలమ్మ చెఱువు దగ్గర మెరక చేనులో మట్టిపని చేస్తూంటే వెళ్ళి, పన్నెండు గంటలకు పటపటలాడే ఎండలో కొరకొరలాడే ఆకలితో ఇంటికొచ్చాడు రంగయ్య. వచ్చీ రావటంతో ముల్లుగర్ర వరండా చూరులో పెట్టి, తలగుడ్డ తీసి, విదలించి నిలబెట్టివున్న మంచంకోటికి తగిలించి — గబగబ వరలబావి దగ్గరున్న రాతి తొట్టిలో చెంబెడు నీళ్ళు కాళ్ళమీద గ్రుమ్మరించుకొని, "ఏమేయ్! అన్నం పెట్టు" అని భార్యను కేక వేశాడు.

తిరగలి ముందు వేసికొని, సున్నిపిండి విసరుతూన్న భార్య గోవిందమ్మ ఆ కేకను వినిపించుకొని 'ఉఁ!' అని నిట్టూర్పు విడుస్తూ పీటమీదనుంచి లేచి, వంటగదిలోకి వెళ్ళింది.

గరపచేనుకుమల్లే ఎర్రగా నీర్కావి ఎక్కిన కండువాతో ముఖం తుడుచుకుంటూ రంగయ్య వంటగదిలోకి వచ్చి, కావిడిపెట్టెప్రక్కనే భార్య కాపురానికి వస్తూ తెచ్చిన పీటమీద మునిగాళ్ళతో కూర్చుంటూ — "ఏంకూర?" అన్నాడు.

బాదంకాయ పళ్లెంలో గోవిందమ్మ అన్నమూ, శుద్ధపప్పు, ఎర్రకారపు పచ్చడీ, వంకాయ ఇగురూ అమర్చి పెట్టింది. తర్వాత చిన్న పింగాణీగిన్నెతో బెండకాయ, ములక్కాయ, దోసకాయ వేసిన పులుసు పెట్టింది. ఆపైన కాశీచెంబుతో మంచినీళ్ళు పెట్టి, వంటగది వాకిట గడపమీద చతికెలబడింది గోవిందమ్మ భర్తకేసి చూస్తూ.

తల పైకి ఎత్తకుండా మూడు నిముషాల్లో పళ్లెంలోని అన్నాన్నీ, కూరలనూ, గిన్నెలోని పులుసునూ కాళీచేసి.... "అయింది" అన్నాడు రంగయ్య తలపైకెత్తి.

మజ్జిగ పిడతలోని చల్లను జర్మన్ సిల్వర్ కూపాలోకి పోసి, భర్తముందు పెట్టింది గోవిందమ్మ. కొంచెం అన్నంవడ్డించింది.

నీళ్ళకంటె పలుచనైన ఆ మజ్జిగను చూపి ముఖం గట్టిగా చిట్లించుకున్నాడు రంగయ్య.

"పెరుగు లేదా?"

"ఉహుఁ!"

"పాలు"

"అయ్యో! నారాతా! నేను కాపురానికి వచ్చి పన్నెండేండ్లు అయింది. అప్పట్నుంచీ ఒక్కనాడైనా యీ కొంపలో పాలూ, పెరుగూ దండిగా వున్నాయా? ఆయమ్మ, యీ అమ్మమీద ఆధారపడటమేగా! ఏంలాభం? లంకంత చావడి వుంది. కొండంత వామీవుంది. మానెడు పాలను కళ్ళారా చూసేరోజు లేదు. పాడిలేని ఇల్లు పచ్చగా వుండదంటారు. నేను ఎంత మొత్తుకున్నా నా మాట వినరుగా. భోజనానికి కూర్చున్నప్పుడు మాత్రం గడ్డపెరుగూ, చిక్కటి పాలూ కావాలి. ఎట్లా వస్తాయి? మనకున్న గేదెల్లా పట్టుమని మూడు అరసోలలు పాలిచ్చేవి లేవుగదా! మీ అన్నగార్ని చూసైనా మేల్కోరాదూ. ఆయన భార్య రత్తమ్మ పాడిమీద ఇల్లు చక్కగా గడుపుతూన్నదంటే — శేర్లకుశేర్లు పాలిచ్చే గేదెలు వుండబట్టే గదా!" అన్నది గోవిందమ్మ గుక్కతిప్పుకోకుండా.

భార్య ఉక్రోషపుగాలి రంగయ్య చెంపలకు తీవ్రమైన వడగాలి తగిలినట్లు తగిలింది. కోపం కస్సుమని కనుబొమలపైకి సోకగా, రోషంతో బుస్సున లేచి ఎంగిలిచేయి కడుక్కొని, బీరువా తెరచి, పైకం జేబులో పెట్టుకొని వడివడిగా వీధిలోకి వెళ్ళాడు.

గోవిందమ్మ నిర్ఘాంతపడి చూస్తూనేఉంది. భర్తను 'ఎక్కడకి?' అని ప్రశ్నించలేకపోయింది.

ఆ వెళ్లడం వెళ్లడం రంగయ్య మరునాడు తూర్పు రేఖలు విచ్చుకునేసరికి గానీ ఊళ్ళోకి రాలేదు. వస్తూ వస్తూ కూలి మనిషిచేత కుదిరికైన ఓ బొబ్బిలి గేదెను తోలించుకొని వచ్చాడు. ఆ గేదెను పాలెంలో కొన్నాడు. రాత్రి స్వయంగా దగ్గరుండి, ఖాయదాదారునిచేత పాలు తీయించి, చూసి,

సంతృప్తిపడి మరీ నాలుగువందల రూపాయలకు కొన్నాడు. 'ఈ గేదెతో దానిగోల వొదులుతుంది. ఈ గేదె పాడితో అది ఎట్లా సంసారాన్ని వనరుగా గడుపుతుందో, ఇంట్లో పాలకీ, పెరుగుకూ, నేతికీ వీసమెత్తు కరువు రాకుండా చేస్తుందో తను చూడాలి. తనకు పాడిగీత లేదని తెలుసు. ఎంతోమంది జోస్యులు తన జేయిచూసి ఆ మాట సెలవిచ్చారు. అందుకు తగ్గట్టుగానే గతంలో తను ఎన్నో గేదెల్ని ఖరీదుకు జంక కుండా కొనుక్కొచ్చి—నష్టపడ్డాడు. ఈ తఖా దాని పోరు అణచటానికి దానికోర్కె మేరకు యింత ఖరీదుపెట్టి యీ గేదెను కొంటున్నాడు.' అనుకున్నాడు రంగయ్యా.

రంగయ్యా రోషానికి రోలును మెడకుకట్టుకొనే మనస్తత్వం గలవాడు. తనకి ఇష్టంలేని విషయాలు యితర్లకు బాధని కలిగిస్తున్నట్టు తెల్సికొన్నప్పుడు—తన అయిష్టాలను ఖాతరు చేయనివ్యక్తి. రోషంముందు అతని పూర్వపు పట్టుదలలు మంచుతెరలవంటివి.

ఊరి చెరువుకట్ట మొగదలనుంచీ ఆ గేదెను చూసి ఎక్కడ కొన్నావనీ, ఎంతకు కొన్నావనీ, ఎంత గొప్ప గేదెయనీ—రంగయ్యాను చాలమంది రైతులు ప్రశ్నించారు. అందరికీ అతను ఓర్పుగా సమాధానాలు చెప్పాడు. ఆ గేదెను చావిట్లో కట్టుగొయ్యకు కట్టివేయించి, కూలిమనిషి చేతిలో రెండు రూపాయలుపెట్టి, ఇంట్లోకి వచ్చాడు. చావిట్లోకి వెళ్లేటప్పుడే గోవిందమ్మ ఆ గేదెను చూసి సంపూర్ణంగా సంతృప్తిపడింది.

"ఎట్లావుంది గేదె?" అన్నాడు భార్యతో రంగయ్యా.

"చూపులకు బాగానేఉంది. మరి పాలు ఎన్నియిస్తుందో!" అన్నది గోవిందమ్మ అంట్లుతోమిన చేతిని పైటచెంగుతో తుడుచుకుంటూ.

అప్పుడే సూర్యుడు నాలుగుబార్ల పైకి ఎక్కాడు. ఉదయపు తెల్లనిఎండ వరండాని పూర్తిగా ఆక్రమించుకున్నది.

"మూడుశేర్ల పాలకు దిగుల్లేదు. నిన్న సాయంత్రపుపూట దగ్గరుండి తీయించాను. ప్రొద్దునపూట ఇంకో సోల పాలు ఎక్కువగా యివ్వవచ్చు"

ఇంకా అంతకంటె గోవిందమ్మకు ఎక్కువ కావాల్సి ఏముంది? మనస్ఫూర్తిగా మురిసిపోయింది.

"ఇదుగో! ఇన్నాళ్లూ నామీదనెపం నేటితో తీరిపోయింది. మాంచి నదరైన గేదెను కొనుక్కొచ్చాను నాలుగొందలకి. ఆ గేదె పాడిచేసి సంసారాన్ని పచ్చగా వుంచాల్సిన బాధ్యత నీదే!" అన్నాడు రంగయ్యా ఉత్తరాది కేరుపుగాకు చుట్ట వెలిగిస్తూ.

గోవిందమ్మ ఓరగా చూస్తూ, లీలగా తల ఆడించింది 'చూస్తారుగా' అన్నట్టు.

చెంబునిండా ఎర్రనీళ్లు కలిపి, గేదెకు దిష్టి పోగలందులకు దిగదిడుపుకు గాను గోవిందమ్మ చావిట్లోకి వెళ్ళింది. అప్పటికే తోడికోడలు రత్తమ్మా, ప్రక్కింటి శాయమ్మా, ఎదురింటి వెంకాయమ్మా చావిట్లో మొండిగోడచెంతను నిలబడి గేదెను అదేపనిగా చూస్తున్నారు' 'ఈ ముండల కళ్ళు గేదెమీద పడ్డాయీ' అనుకుంటూ గోవిందమ్మ చిటుక్కున ముఖం చిట్లించుకున్నది.

"గోవిందమ్మా! గేదె బాగానేవుంది. ఈ రోజుల్లో ఎన్ని వందలు పెట్టినా యీపాటి అందమైన గేదెలు దొరుకుతున్నాయా? ఆ కొమ్ముకట్టూ, గేదె వర్ణమూ, పొదుగు తీరూ, నడకా—అన్నీ భేషుగ్గా ఉన్నాయి" అన్నది శాయమ్మగాలిలో చేతులు విసరుతూ.

"పాలు ఏపాటి యిస్తుందేమిటి?" అని దీర్ఘం తీసింది తోడికోడలు రత్తమ్మ.

"ఆ! ఏంపాలులే అక్కా! గేదె కంటికి నందిల్లా వున్న దన్నమాటేగానీ - పాలు మామూలే. మహ యిస్తే ఓమానెడు యిచ్చేను. ఏదో మరీ యిబ్బందిగావుందని కొనాల్సివచ్చింది. అంతేకానీ, యీ గేదె పాడిమీద ఇల్లు గడుస్తుందా? పొలం కొంటామా?" అన్నది గోవిందమ్మ పుల్లవిరుపుగా.

"ఆ మాటా నిజమేలే వదినా" అన్నది వెంకాయమ్మ.

ఆ ముగ్గురు ముత్తైదువులు అక్కణ్నుంచి వెళ్లాక, గోవిందమ్మ గేదెకు పాలేరుచేత దిష్టి తీయించింది. ఆ ప్రొద్దునపూట తనేస్వయంగా పాలు తీసింది. మూడు తవ్వలకు పైగా యిచ్చింది. 'దిష్టితగిలి వుంటుంది. మాయముండల కళ్ళు పడ్డాక గేదె పాలు యివ్వటమే.' అనుకుంది గోవిందమ్మ. అయినప్పటికీ ఆ గేదె ఆమె మనస్సుకు బాగా నచ్చింది.

బొబ్బిలిగేదెను కొన్నదగ్గర్నుంచీ గోవిందమ్మకు తీరిక చిక్కటంలేదు. ప్రొద్దస్తమానమూ ఆ గేదెతో నేసరిపోతున్నది.

తెల్లవారుఝామున కొబ్బరిచెక్క, తవుడు నానవేసిన కుడితి తాపటమూ, సూర్యోదయం ముందు జనుపకట్టెవేసి పాలు తీయటమూ, బాగా ఎండఎక్కాక మళ్లీ మేతవేయటమూ, మధ్యాహ్నం కుడితి, జనుపకట్టె, సాయంకాలం పచ్చిగడ్డి, పాలుతీయటమూ, రాత్రిపూట మేతా - వీటితో ఆమెకు కాలం తెలీకుండానే గడిచిపోతున్నది. ఆ గేదె బాగానే పాలిస్తున్నది. ప్రొద్దునపూట నాలుగుశేర్లూ, సాయంత్రం మూడుశేర్లూ, ఊళ్ళో హోటలు నాంచారయ్యకు నిత్యమూ రెండుశేర్లు పాలు పోసే వాడిక పెట్టింది. పెరుగు శాంతమ్మకు రోజూ మానెడు పెరుగువేసే వతనపెట్టింది. అదీగాక కరణంగారికి వారానికి వీశె వెన్న వేసేట్టు ఒప్పుదల అయింది. గేదె పాడిమీద ఆదాయం బాగానే వస్తూన్నది. మంచిగేదె పాడినిగూర్చి గోవిందమ్మ కన్న కలలన్నీ క్రమంగా నిజరూపాలకు రాజొచ్చినయ్. కోమటికొట్లో ఉప్పూ, చింతపండూ, మిరపకాయలూ, మంచి నూనె మొదలైన వెచ్చాలకూ, ఇంటిల్లిపాదికీ గుడ్డలూ, పెద్ద పిల్లవాడికి ప్రైవేటు చదువు ఖర్చూ, మందులకూ - అన్ని ఖర్చులు గేదె పాడిమీద వచ్చే ఆదాయంలోనే జరుగుబాటు అవుతున్నాయి.

గోవిందమ్మ పాడిగేదెమీద యిన్ని ఖర్చుల్ని ఆదుకోవటం — ముఖ్యంగా తోడికోడలు రత్తమ్మకు కళ్ళల్లో కారపునీళ్ళు చిందిపడ్డట్టుగావుంది. ఆ బొబ్బిలిగేదె రాకముందు ఆ వీధిలో గేదెపాడిని గురించి చెప్పుకోవాల్సినప్పుడు రత్తమ్మనే అందరు చెప్పుకొనేవాళ్ళు. ఆమెదే పైచేయి. ఆమె దొడ్లోవున్న గమిడి గేదెను మించిన గేదె దాదాపు ఆవూళ్ళోనే లేదని చెప్పుకోవటంకూడా కద్దు. అటువంటిది గోవిందమ్మ బొబ్బిలిగేదె ద్వారా రత్తమ్మ ఖ్యాతిని తగ్గించింది. ఆమె పేరు ప్రతిష్ఠల ఆధిక్యతకు అడ్డుగా నిలిచింది. ఏ గొందిలో విన్నా, ఏ వీధిలో చూసినా — గోవిందమ్మ గేదెనుగురించి మాట్లాడుకొనేవాళ్లే! తనేంచేయాలి? తనపేరు, గేదె పాడి చేయటంలో తన సామర్థ్యమూ, గేదెల్ని మేపటంలో తన శ్రద్ధా — అన్నీ గోవిందమ్మ ముందు కొఱగాకుండా పోయే చెడుకాలం దాపురించింది. తనపేరు నిలబెట్టుకోవాలి; ఊళ్ళో అమ్మలక్కల్లో తనే పాడిగీతగల స్త్రీగా చెల్లుబడి కావాలి! ఎట్లా? తనూ, భర్త చేత మంచి బొబ్బిలిగేదెను కొనిపిస్తే! అమ్మో! అయిదువందలేనా కావాలి. ఆయన ఒప్పుకోరు!....మరి. ఇంకేంచేయాలి? రత్తమ్మకు క్షణం విశ్రాంతిలేకుండా రోజులు గజిబిజిగా గడుస్తున్నాయి. తెల్లవారఝామున లేచిందిమొదలు, రాత్రి పొద్దుపోయి నిద్రపోయేవరకూ - గోవిందమ్మ గేదెనుగురించే ఆలోచనలు. ఆమె పాడిమీద ఆదాయాన్ని గురించే కన్నెర్ర! ఆమె సుళువుగా ఇల్లు గడపటంమీదే అసూయాద్వేషాల జ్వరం! పైపెచ్చు ఇరువురి గొడ్లచావళ్ళు ఒకేచోట కావటంవల్ల ఎప్పుడు చావట్లోకివెళ్ళినా — గోవిందమ్మ గేదె అందంగా నదరుగా, నందికిమల్లే, చక్కగా, ఇంటికి మహాలక్ష్మివలె కనబడుతుంది.

* * *

ఒకరోజు ఉదయం గోవిందమ్మ మామూలుగా బొబ్బిలిగేదె పాలు పితకటానికి కూర్చుంది. చేపు రావటానికి దూడను విడిచింది. గేదెముందు జనుపకట్టె వేసింది. మూడునిముషాలు గడిచినా, దూడ పాలుకుడవటమే గానీ - గేదె చేపుకురాలేదు. గోవిందమ్మకు సంభ్రమాశ్చర్యాలు కలిగాయి. ఆ దూడను స్తంభానికి కట్టివేసి, పాలతపేళాలోకి పాలు పితకనారంభించింది. అర్ధశేరు పాలకంటె పితకలేకపోయింది. రోజూ ఉదయం నాలుగుశేర్ల పాలిచ్చేగేదె అర్ధశేరు పాలు ఎందుకివ్వాలి? పైగా ఆమె ఇంకా పాలను పితికేందుకు గట్టిగా ప్రయత్నించగా నెత్తురుజీరలు పడ్డాయి. గోవిందమ్మకు కళ్ళు తిరిగినంత పనైంది. ఆమె ఆశ్చర్యానికి అంతులేకపోయింది.

ఏంజరిగింది? ఇవాళ గేదె ఎందుకు చేపలేదు? అర్ధశేరు కంటె ఎందుకు పాలు ఇవ్వలేదు; ఏముండో దిష్టికొట్టి వుంటుంది?—మరి మేత బాగానే మేస్తున్నదే! కుడితికూడా బాగానే త్రాగిందే! ఏదో జరిగివుంటుంది. ఎవ్వరో, ఏదో చేశారు. ఎవరున్నారు తనకి విరోధులు? విరోధులే అక్కర్లేదు, యీ లోకంలో విరోధులు చేయలేని చెడూ, ఘోరకృత్యాలూ అసూయాపరులు చేస్తున్నారు. సాటివారు పచ్చగావుంటే చూడలేని యీ మనుష్యులు, ఏదోవిధంగా నష్టాన్ని కలిగించి సంతృప్తిపడతారు. ఇవాళ ఒక్కరోజు తనగేదె పాలివ్వకపోతే తను నష్టపడేదేముంది?—అనుకున్నది గోవిందమ్మ. ఆ విషయం భర్తతోకూడా చెప్పలేదు.

మళ్ళీ సాయంత్రం మామూలుగానే మూడు శేర్ల పాలిచ్చింది.

కాని మరునాటి ఉదయం మటుకు అర్ధశేరుపాలే యిచ్చింది. దూడను విడువగానే, చేపుకోవటమూ, కదలకుండానే పాలివ్వక

పోవటమూ, బాగా పితికితే నెత్తురు జీరలు రావటమూ జరిగింది. మూడోనాటి ఉదయంకూడా ఆ లక్షణాలే కనబడేప్పటికి గోవిందమ్మ మతిపోయింది. చాలవిచిత్రంగా కనిపించింది. గేదె అప్పుడే ఒంటిపూటలో పడేందుకు వీలులేదు. ఉదయంపూట పాలివ్వకుండా, సాయంత్రంపూట ఎక్కువ పాలివ్వడం పాడిగేదె పద్ధతికాదు. ఏదో కుంభకోణం జరుగుతూ వుండివుంటుంది. ఎందుకైనా మంచిదని దిష్టిత్రాడు, వెంట్రుకల్త్రాడు వేయించి, గేదెమెడలో కట్టించింది. ప్రక్కవూరినుంచి అంచనకూడా తెప్పించి, గేదె కాలికి కట్టించింది. కాని ఏం లాభం లేకపోయింది. ఆమె మనస్సులో కొన్ని అనుమానాలు పొళ్ళగింతలు పెడుతూనే ఉన్నాయి. భర్తతో చెప్పింది. కాని రంగయ్య ఆశ్చర్యాన్ని అద్భుతంగా ప్రకటించలేదు.

"నే చెప్పలా, మనకు పాడిగీత లేదని. అది అక్షరాలా నిజమైంది. అదేమిటో మన ఇంటిముఖం చూస్తేనే కామధేనువుకూడా కాసిని పాలివ్వదు. "ఇంతకీ పాడిగీత ఉండాలి" అన్నాడు రంగయ్య కనుబొమలు ఎగురవేస్తూ.

"సింగినాదం, జీలకర్ర! నాకు పాడిగీత దిట్టంగానే ఉన్నది. కాని గేదె ఉదయంపూట పాలివ్వడం లేదంటే, ఏదో గూడుపుఠాణీ జరుగుతూవుంటుంది. అంతేగానీ, రోజూ నాలుగుశేర్ల పాలు జమాయించి యిచ్చే గేదె అర్ధశేరు పాలల్లో పడటమేమిటి? అసూయకొద్దీ ఎవ్వరో ఏదో కీడు చేస్తున్నారు" అన్నది గోవిందమ్మ ముఖాన్ని ముదురు వంకాయకుమల్లే మాడ్చుకుంటూ.

"ఇదొకటా, పైగా. నీ వెర్రి అనుమానాలతో కొంపమీదకు ఏదో తగువు తెచ్చేట్టున్నావే! మనగేదె పాలిస్తే, ఇతర్లకు కన్నెర్రదేనికి? మీ ఆడవాళ్ళ తెలివితేటలిట్లా నేతగలడతాయి. తమ బలహీనతను అంతతేలిగ్గా బయటవేసికుంటారు. తమ అనుమానాలతో సంఘాన్నంతా కలుషితం చేస్తారు" అన్నాడు రంగయ్య.

"నిజం నిలకడమీదగానీ బయటపడదు" అంటూ గోవిందమ్మ వంటగదిలోకి వెళ్లింది విసరుగా.

ఆ మరునాడు ఉదయం గోవిందమ్మ బంధువుల్లో చనిపోయిన ఒకరి పెద్దకర్మకు పొరుగూరు వెళ్ళాల్సివచ్చింది. మొదటి బస్సు ఎక్కితే, వేళకు ఆవూరు చేరుకోవచ్చుననే తలంపుతో బాగా తెల్లవారఝామునే లేచింది. అప్పటికి తొలికోడి కూసింది. ముందు గేదె పాలుతీసి, తర్వాత ఇంటిపనులు త్వరగా ముగించుకొని, మొదటిబస్సుకు అందుకొనేందుకు ఆజీలుగా వుంటామనుకొని, గోవిందమ్మ పాలతపేళా తీసికొని చావిట్లోకి వెళ్ళింది.

చీకటి పల్చబడలేదు. ఊరు మేల్కొలేదు.

గోవిందమ్మ చావడిదగ్గరకు వెళ్లేసరికి, 'జుంయ్ జుంయ్'మని గేదెపాలు తీస్తూన్న శబ్దం వినవచ్చింది. ఆమె నిలారిపోయింది కొన్నిక్షణాలపాటు. మెల్లగా తడికె గేటు తొలగించి, చావట్లోకివెళ్లి — పిడకలగూడుచెంత నిలబడింది గోవిందమ్మ. ఓ స్త్రీ గేదె పాలు పితుకుతూన్నది. ఆ మసక చీకట్లో ఆమెను గుర్తించింది. అకస్మాత్తుగా గోవిందమ్మకు ఓ రకమైన భయమూ, ఆదుర్దాకలిగాయి. చిన్న పొడిదగ్గు దగ్గింది.

పాలు తీస్తూన్న ఆడమనిషి, ఉలిక్కిపడి, గాబరాపడి, చేతిలోని పాలతపేళాను గజగజలాడించింది.

"ఎవరదీ!" అన్నది గోవిందమ్మ గొంతు పెద్దదిచేసి.

గేదెపాలు తీస్తున్న స్త్రీ గబుక్కున నిలబడి, పిడకలగూడు చాటుకుపోబోయి, బొంగు పొడుచుకొని 'అబ్బా!' అన్నది. ఆమెచేతిలోని పాలతపేళా క్రిందబడింది. మసకచీకట్లో తెల్లని పాలు నేలపై ఒలకిపోయాయి. ఆమె గబగబా ఆ తపేళా తీసికొని తడికె గేటునుంచి గొందిలోకి వెళ్లింది.

ఆమెను బాగా గుర్తించింది గోవిందమ్మ. ఆమె ఎవరో కాదు. తోడికోడలు రత్తమ్మే! గోవిందమ్మకు మొదట్నుంచీ రత్తమ్మమీదే అనుమానం. ఆ అనుమానం చివరకు కళ్ళారా నిజమైంది. ఎటువంటి తప్పుడుపని? ఎల్లాంటి దొంగతనం? ఎక్కడేనా వుందా - ఇట్లాంటి నీతిమాలినపని? ఛి. ఛీ. ఇట్లా ఇతర్ల గేదలపాలు తీసికొని బ్రతక్కపోతే యేం? మనిషికీ అంత అసూయ పనికిరాదు. అనుకుంది గోవిందమ్మ. పాలుతీయకుండానే ఇంటికివెళ్లి - భర్తను నిద్రనుంచి లేపి, ఈ విషయం చెప్పింది. రంగయ్య సంభ్రమాశ్చర్యచకితుడైనాడు.

"చూడండి. పాడిగీతలేదు. పాడిగీతలేదు అని నన్ను ఎద్దేవా చేసేరుగానీ అసలు కిటుకు కనిపెట్టారా? నేనంటే మీకంత లోకువ. మీ అన్నపెళ్లాని కిదేంబుద్ధి చెప్పండి. తెల్లవారాక యీ సంగతి గడపగడపకూ చెప్పి, రత్తమ్మ పరువు ప్రతిష్టలు

"రచ్చకీడ్వకపోతే నాపేరు గోవిందమ్మే కాదు" అన్నది గోవిందమ్మ తల ఆడిస్తూ.

నిజంగా భార్య అంతపనీ చేస్తుందని భయపడ్డాడు రంగయ్య.

"ఛీ, అట్లాంటి పాడుపని చేయకు. అంతా ఒకకుటుంబానికి, వంశానికి చెందినవాళ్ళం. మనలోని లోటుపాట్లను మనమే బయటపెట్టుకుంటే వీధిలోవాళ్ళకు పల్చబడిపోమూ. నువ్వు అట్లా ఎక్కడేనా వాగితే నేనూరుకోనేదిలేదు. జాగ్రత్త. మా అన్న భార్య అట్లాంటిపని జేసిందంటే ఆ అపకీర్తి మా అన్నకు రాదూ. మీ ఆడవాళ్లు చిల్లరమల్లర తప్పుడుచేష్టలకు కుటుంబమే అతమైపోతుంది. ఈ విషయం రెండోకంటివాడికి తెలిసిందా! నిన్ను క్షమించేదిలేదు' అన్నాడు రంగయ్య భార్యను గదుముతూ.

గోవిందమ్మ భర్తకేసి దిగాలుపడి చూసింది.

నుదుటమీద తెల్లగుడ్డ పట్టీ వేసికొన్న రత్తమ్మను ఆ మరునాడు ఇరుగూపొరుగూ స్త్రీలు "అదేమిటి వదినా! ఆ నుదుట మీద ఆ కట్టు ఏమిటి?'' అని అడిగారు. ఆ ప్రశ్నకు రత్తమ్మ మంగలంలో పేలపుగింజకుమల్లే ముఖం చిట్లించుకొని—"రాత్రి, చీకటిలో వంటగది తలుపుచెక్క పొడుచుకుంది'' అని సమాధానం చెప్పింది.



# ప్రభుత్వ నిర్ణయాలు

కృష్ణాబ్యారేజ్ ప్రాంతంలోని బంజరు భూములను వేలంవేసి ఆ సొమ్మును హరిజనుల సహాయార్థం వినియోగించాలని ప్రభుత్వం నిర్ణయించినది. సహాయం, సాధారణ భూమి విధానం క్రింద సాగుకిచ్చిన భూముల బాగుకీ లేక యిళ్లస్థలాలకు గ్రాంట్లు లేక అప్పుల రూపంలో చేయబడుతుంది.

ప్రాజెక్టువల్ల దెబ్బతిన్న భూమి కేటాయింపుకి సంబంధించి యిప్పుడు ఆంధ్రప్రాంతంలో అమలులో నున్న నిబంధనలు తెలంగాణా ప్రాంతానికికూడ వర్తింపచేయబడతవి.

ప్రభుత్వ భూములలో 250 ఎకరాల విస్తీర్ణానికి మించి నీటి పారుదల సౌకర్యాలులేని చౌడు భూములు లేక అడవి కుప్పలు లేక దట్టమైన పొదలుగల భూములను సహకార వ్యవసాయానికి లేక సమిష్టి సేద్యానికి కేటాయించాలని ప్రభుత్వం నిర్ణయించినది. వాటిని ప్రభుత్వమే బాగుచేయిస్తుంది.

రాష్ట్ర లెజిస్లేచర్ వచ్చే సమావేశంలో కంటిపొర తీయుటను నిరోధించే (కంటిపువ్వు ఆపరేషన్) బిల్లు ఒకటి ప్రవేశపెట్టబడుతుంది. సున్నితమైన యీ ఆపరేషన్‌ని అధికారం పొందని వ్యక్తులు చేయకుండా నిషేధించుటకై యీ శాసనం రూపొందించ బడుతున్నది.

రాష్ట్రంలో చర్మపరిశ్రమాభివృద్ధికి దోహదం చేయుటకై ఒక తాత్కాలిక చర్మ పరిశ్రమాభివృద్ధి సంఘాన్ని ఏర్పాటు చేయవలెనని ప్రభుత్వం నిర్ణయించినది. ఈ సంఘం చట్టబద్ధమైన సంఘం ఏర్పాటుకు తగిన శాసనం జరిగేవరకు పనిచేస్తుంది.

ఆకాశవాణి మీడియం రిలే కేంద్రాన్ని నెలకొల్పుటకై కడపలో దాదాపు 40 ఎకరాల భూమిని ఉచితంగా లభింపచేయటానికి ప్రభుత్వం అంగీకరించినది.

తెలంగాణాలోని కొన్ని సహకార బ్యాంకులు కడప సహకార బ్యాంకు చేసిన ఋణాల తీర్మానానికై వాటికి గ్రాంటుల నివ్వటానికి ప్రభుత్వం నిర్ణయించినది. ఇందుకు మొత్తం రూ. 12.19 లక్షలు కాగలవు.



# గ్రీష్మ విక్రాంతి

శనగన నరసింహస్వామి

ద్యుమణి ప్రచండ రూపమున దోచె వియత్పథమందు, చంద్రికా
భ్రమణము గోరె భూజనము, వారిచయమ్ము సదావగాహన
క్షమత వహించె, మన్మథుడు శాంతిని బొందెను, రమ్యమయ్యె లో
కమున దినాంత, మిట్లు శుచికాలముపాగతమాయె, ప్రేయసీ !

ఒకపరి తారకాప్రియత మోదయధూతతమ స్తమస్వతీ
నికరము, నొక్కచోట కమనీయపమోమయ యంత్రమందిర
ప్రకరము, నొక్కనాడు మణివర్గ విశేషము, నార్ద్ర చందనం
బొకయెడ లోకసేవనము నొందు నిదాఘమునందు, సుందరీ !

మించు సూర్యాతపమున కారించు దప్పి
కరము తాలువులెండి, మృగములు నాల్గు
దెసల భిన్నాంజనము వోని దివిని జూచి
పఱచు వనమందు, జలమను భ్రాంతి తోడ.

వేసగి వాసరమ్ముల సవిభ్రమసంస్మితవక్ర వీక్షణా
భ్యాసమునన్, నిశాకరమహారమణీయవిభూషణైకసం
ధ్యాసమయమ్ములట్లు, సకలాధ్వగ చిత్తములన్ లతాంత బా
ణాసన దీపనమ్మును పొనర్త్రు విలాసవతుల్, తలోదరీ !

నిప్పు చెఱిగెడు నెండకు తప్పజనుచు
తప్తపాంసు పథమ్మున తనువు కాలి;
వక్రగతి, నిశ్వసించు చవాఙ్ముఖముగ
ప్రాకిఫణి, నెమ్మిపురి నీడపట్టు జేరు.

సారెకు నిశ్వసించుచు, తృషాగరిమమ్మున విక్రమోద్యమం
బారడి వోవగా, రసన నట్టిటు లూచుచు, వక్త్రరంధ్రమున్
దూరము విస్తరించుచు, నదూర గజమ్మును గూడ పట్టి సం
హారము సేయబోదు చలితాగ్రసటా మృగరాజ, మంగనా !

తుండశీకరజలమున నెండి పోవు
గొంతు తడి జేసికొనుచు, పైకొనిన యెండ
బిట్టు దగగొని, సలిలమ్ము వెదకుచున్న
కరులు భయపడ విపుడు కేసరులకైన.

వేసవి హుతాగ్ని గతిమండు వింతయెండ
తనువులును చేతములు కూడ తద్దకమలి;
నెమళులు స్వకీయఫించ చక్రముల క్రింద
చేరు పామును చంపగా కోర విపుడు.

భద్రము_స్తము లెత్తగా పంకమెండు
పడియలంబెద్ద ముట్టెల పొడిచి త్రవ్వ
పందిగుంపులు పేరెండ కంది, భయము
నంది భూతలమును జొచ్చునట్లు తోచు.

తరణి తీవ్రాతపమునకు తాళలేక
బురదగొన్న సరోవరాంబువుల నుండి
యెగిరి భేకము, తృషిత పన్నగ ఫణాత
పత్ర తలమున నివసించు, భయము దక్క.

తమ్మితూడుల బెటికి, మత్స్యముల ద్రొక్కి.
బెగ్గురుంబుల్గు బారుల బెదరగొట్టి,
గజము లన్యోన్య పీడన ఘర్షణముల
రొంపి నింపెను సకల సరోవరముల.

రవికరోద్భిన్న మస్తక రత్నదీప్తి,
దారుణ విషాగ్ని నెగులొంది, దప్పిగూరి,
లోల జిహ్వాద్వయమ్మున గాలి గొనుచు
సర్పము, ప్లవంగ కులమును జంపదిపుడు.

నురుగులు కారుచుండ పెనునోళులు విప్పి కదల్చుచున్, తృషా
భరమున రక్తజిహ్వలను పైకి నిగుడ్చుచు, మేదినీధ్ర కం
ధరము వినిర్గమించి, వదనమ్ములు మిన్నుల వంకయెత్తి, కా
సరములు గుంపులై జలవిచారము సేయును నేడు, కోమలీ !

ఘనతర దావవహ్ని బడి కాలిన పైరుల మొల్కలన్, పటు
స్వనమున వీచు గాలికి వశంబయి త్రిమ్మరు నెండుటాకులన్,
దినమణి భాను ఘర్మగురు తీవ్రత నింకిన నీటిపట్టులన్,
వనములు భీతిగొల్పును గనన్ గిరి కొమ్ముల నుండి, భామినీ !

క్లాంతవలీముఖమ్ములచలాభ్ర నికుంజము చేరగా, పత
త్సంతతి జీర్ణపర్ణతరుశాఖల నిశ్శ్వసియించు, వార్యుత
ప్రాంత మపేచ్ఛమై గవయవర్గము లెందు భ్రమింప, ఛన్నకూ
పాంతజలమ్ముజిహ్మ శరభావళి ప్రోద్ధరియించు, రాగిణీ !

మారుతచండ వేగ గరిమప్రభవద్రయరుద్రమై, తట
ఞ్మారుహశాఖికాళిఖర సంగతి పొంగి, కుసుంభరక్త సిం
దూరవిభావిభుత్వమున, తూర్ణముగా, వన వహ్ని యెందు సం
చారము జేసి భూములను సర్వము దగ్ధ మొనర్చు, నెచ్చెలీ !

గిరిదరులందు కీలలు లగించును, ప్రస్ఫుటియించు భీకర
స్వరముల శుష్కవంశ వనవాటి, ప్రతిక్షణ వర్ధమానమై
విరవిరప్రాకు బాలతృణ విస్తర వీథుల, ప్రాంతలగ్నమై
హరిణములన్ గమల్చును దవాగ్ని, సమీరణవృద్ధమై, సఖీ.

బూరుగు చెట్లతోపుల ప్రభూతభవమ్మును బొంది, పచ్చ బం
గాగువలెన్ ద్రుకోటరముఖమ్ముల మండుచు, ప్రాంశుశుష్కభూ
మీరుహరాజి ప్రాకుచు, సమీరసమీరితమై దవాగ్ని, సం
చారము జేయు వేసవిని సర్వవనాంతము నందు, జవ్వనీ !

కారుచిచ్చున మేనులు కమరి, ద్వంద్వ
భావమును వీడి, నెయ్యుర పగిది గూడి,
కొండ గవినుండి వెడలి, వేదండ గవయ
సింహములు; సింధుసైకత సీమ జేరు.

సలిలనిషేక సౌఖ్యము, నిశాకరదీధితి హార సేవ్య, ము
త్పులకిత పద్మఖండ చితతోయము, పాటల పుష్ప వాసనా
కలితము గ్రీష్మవేళ చనుగావుత మీకు సఖీయుతమ్ముగా,
సులలిత గీతిహర్మ్య కటిసుస్థితి, రాత్రులయందు, సర్వదా !

★

# గొలుసు

బుచ్చిబాబు

(గతసంచిక తరువాయి)

## రెండో అంకం

(పరంధామయ్య ఇంట్లో మండువాగది. ఒకపెద్ద గుండ్రని బల్ల-నాలుగైదు కుర్చీలూ వుంటాయి. గోడని వొకటి రెండు పటాలు, పొదుపు ఉద్యమం పోస్టర్-మూలగా కార్నర్-స్టాండ్‌పైన పూలతొట్టి.-మధ్య బల్లమీద కాఫీ కప్పులు, ప్లేట్లు, ఫిల్టరు, మొదలైన విలువైన సామానుంటుంది. తెర లేవగానే బల్లముందు రామయోగి నిలబడి అద్దంలో చూసుకుంటూ మాట్లాడుతూ కనిపిస్తాడు).

రామయోగి: ఈనాడు శుభదినం—రెడ్‌లెటర్ డే— సువర్ణాక్షరాలతో మనగ్రామం పురోగమనం చరిత్ర లిఖించబడుతూంది:— రెండు పంచవర్ష ప్రణాళికల ద్వారా, రెండైదులు పది అన్నట్లు పదిరెట్లు, సాంస్కృతికంగా-(నోరు తిరగదు దాం తగలెయ్య) ఆరోగ్యరీత్యా — ఆర్థికంగా — వైజ్ఞానికంగా—మనం పెరిగాం—పెరుగుతూ వున్నాం.

కాని వాటీజెప్లాన్? ప్రణాళికంటే ఏమిటి? అదొక కాగితం. ఆ కాగితం ఈ.... ఏమనాలో తెలీదు — ఈ అద్భుతమైన, వాటీజ్ ది వర్డ్? రివొల్యూషన్ అనకూడదేమో—ట్రాన్స్‌ఫర్మేషన్? — ఆ-రినైజాన్స్ — వికాస రభీస చైతన్యత మోస, వైక్లబ్య మోక్షన — సమాసం తప్పేమో — పెద్దలు క్షమించాలి — కాని నామస్సులో ఏముందో మీకు తెలుసు. మాటలు కేవలం ధ్వనులు, వాటి వెనుకవున్న అంతరార్థం, 'ఉత్తేజం. అన్నా తప్పులేదేమో — అది ముఖ్యం ఇంతకీ చెప్పొచ్చేది— (జేబులోంచి కాగితం తీసి చూసుకుని మళ్లా లోపల పెట్టేసి) —చెప్పొచ్చేదేమిటంటే.— ఈనాడు సుభిక్షంగా, —సుక్షేత్రంగా పురోగమించడానికి కారణం ఏమిటి? ప్రజ. మనం. మీరూ నేను. (మళ్లా కాగితం కేసి చూస్తాడు) పట్నాలలో వారికి విందులున్నాయి. ఆకలి లేదు. పల్లెలలో వారికి ఆకలుంది, విందులులేవు. మన గ్రామంలో ఈ రెండూవుంది — వాట్ షలైసే? — ఇంటెగ్రేషన్ (చేతులు జోడిస్తూ) ఆర్ — సిన్తెసిస్ — అమ్మ చచ్చాన్రా — క్రోడీకరించ బడ్డాయి. ఇదెల్లా జరిగింది అన్న సందేహం రాక మానదు. ఉన్న నోళ్ళ సంఖ్యకి సరిగ్గా సరిపోయిన తిండి వుంది. అంటే మనవి నిర్ణీత కుటుంబాలు - ప్రణాళికలు జారీ అయిన పదేళ్ళలోనూ మనసంఖ్య ఈ పెంచుకు పోలేదు. ఒళ్ళు దగ్గరుంచుకొని ప్రవర్తించాం. ఉదాహరణకి చూడండి — (మళ్లా కాగితం చూస్తాడు) మన గ్రామంలో వెయ్యి గడపుంది. ఈ పదేళ్ళల్లోనూ రెండేళ్ళ కొకరు చొప్పున పరాయివారు, ఈ గృహాలలో సంతానం పేరిట ప్రవేశించివుంటే ఏమవును? వెయ్యి ఇన్టు అయిదు — ఐదువేల జనాభా పెరిగి వుండును. మనకున్న భోజనం వెయ్యిమందికి మాత్రమే. ఈ ఉన్నదాన్ని ఐదువేల మంది తినగలరా? లేరు. ఫలితం? క్షామం. కఱువు ఇక్కడ కరువు అనగానే పై ప్రాంతాలనుండి భోజనం రావాలి. పై ప్రాంతం వారు మన కోసం వోపూట పస్తుండాలి. వారు పస్తుంటే ధాటీగా పని చేయలేరు. ఉత్పత్తిరేటు తగ్గుతుంది. వాళ్ళు ఉత్పత్తి చేసి పై దేశాలకి పదార్థాలు ఎగుమతి చెయ్యక పోతే, జావాలో స్కూల్ మాస్టర్ జీతం ఫస్టు తారీకున అందదు. ఆయనకి జీతం రాకపోతే ఆయన భార్య వొంట చెయ్యలేదు. పుష్టికరమైన భోజనం లేక ఆవిడ ఆరోగ్యం చెడుతుంది; ఆస్పత్రిలో. పురుడు పోసుకుంటుంది. పీలగా వొక శిశువు జనిస్తాడు — పదిఘడియల్లోచస్తుంది — ఇదేనా గొలుసు తత్వం. ఇక్కడ మనం, పధకం, పద్ధతి లేకుండా ఏమరుపాటుగా ఈ సంతానాన్ని కనుకుంటూ పోయామంటే జావాలో వొక శిశువుని హత్య చేశామన్నమాట. మర్డర్, అంటె — ఎక్కడ, ఎవడు ఏపనిచేసినా, దాని ప్రభావం, ప్రపంచం అంతటా,

ప్రతిఒక్కని జీవితంపైనా పడి తీరుతుంది — ఇదే గొలుసు తత్వం — 'రామ యోగీ యిజమ్.'

మరోటి. ఇంక పోషించలేని అధిక సంతానం ఎట్లాంటి వారయ్యా అంటె. — మామామయ్య స్నేహితు డొకాయనికి పెండ్లికాక పూర్వం, సంతానాన్ని పెంచే ఐదు విధానాలు తెలుసుకున్నాడట. పెండ్లి కాగానే, ఆ విధానాలు పోయి. ఐదు గురు సంతానం మిగిలారట. (చప్పట్లు కొడతారు) కాని, మరి — కానీ. — (మూలగా నిలబడి కొంతసేపుగా ఇదంతా వింటూన్న గ్రామసేవిక శాంతమ్మ చప్పట్లు కొడుతుంది).

శాంత : హియర్ హియర్ ....

రామయోగి : ఓ—శాంతమ్మగారా ....

(కంగారుపడి, సవిరించుకు కూర్చుంటాడు)

శాంత : అసలే శాంతమ్మ పాతకాలపుపేరు. పైగా దానికో, గారు, కూడా చేరిస్తే ఎట్లా చెప్పండి. రామయోగిగారు.

రామ : నాదీ అంతేనండి. ఈ లోకంలో ఎన్నో రకరకాల పేర్లుండగా మావాళ్ళకి ఇదే ఎందుకు తట్టాలి చెప్పండి. పేరుకి తగ్గట్లు నడుచుకోలేక నా తాడు తెగుతోంది. యోగి అన్నవాడు మంచి చెడ్డలకి, అపవాదుకి, కీర్తికి అతీతుడవాలి. వాడికోగారు కూడా తగల్చడం భావ్యమా గ్రామసేవికా లలామా ?

శాంత : నాకంటె వయసులోనూ, చదువులోనూ, అన్నింటిలోనూ మీరు పెద్ద. గారు ఎట్లా వొదిలెయ్య మంటారు ?

రామ : రైట్. కాని వొక్క విషయంలో మనిద్దరం సమానులం. —— వొప్పుకుంటావా ? మనిద్దరికీ పెండ్లి కాలేదు.

శాంత : అబ్బ. అట్లాంటివి అనకండి—నాకు భయమేస్తుంది.

రామ : ఆ అయిష్టం వుందే — అదంతా దాచెయ్యబడ్డ ఇష్టం అన్న మాట. ఆఫ్టరాల్ — హిందూకన్య అహోరాత్రాలు కోరేది వివాహమే కదా శ్రీరాముని అక్క పేరుని సార్థకం చేసినవో సుగుణాలరాసీ !

శాంత : ఇక్కడికే నామీద బోలెడు అభాండాలున్నాయి. పెండ్లికాని స్త్రీకి మన సంఘంలో గౌరవం లేదు. ఏదో ఉద్యోగంలో చేరి స్వతంత్రంగా బ్రదుకుదామంటే వీలు పడదుకదా —

రామ : ఏమాట కామాటే అనాలి-మన పెద్దలు వివాహం ఐనవాళ్లని మాత్రం విడిచి పెట్టారనా ? లేదు. వారికి నిండైన సుఖజీవితం అంటే ఏమిటో తెలీదు. ఇతరులు దానికోసం ప్రాకులాడు తున్నారంటే వారు సహించలేరు. అందుచేత ఏ కొత్తదోవ తొక్కినా వారి విమర్శకు గురి కావల్సిందే. ఇంతకీ ఏమాత్రం విన్నావ్ — నచ్చిందా నా ఉపన్యాసం — సవరణలు అవసరమా? నీ యభిప్రాయం బెట్టిదో ?

శాంత : పాపం కష్టపడి భట్టీ వేశారుగాని — బహిరంగ సభలో ఉపన్యసించే అవకాశం రాదేమోలెండి. ఎందుకంటారా ? మా బ్లాకువాళ్లు వేసేనాటకం కుటుంబ నియంత్రణ పథకం గురించి. బోలెడు సంతానంతో సతమత మవుతున్న వొక కుటుంబ పెద్ద. — శ్రీ కుటుంబయ్యగార్ని అధ్యక్షులుగా పెడ దామని మొన్న నిర్ణయించారు. ఒక రాయికి రెండు పిట్టలు కూడాను.

రామ : కుటుంబయ్య పిట్టేమిటి—రాబందు. మధ్యలో ఆడినందుకు క్షమించు బేలా.

శాంత : కుటుంబయ్యగారి దొడ్డివైపు తోటలో పదిగజాల నేల లాగేసి దాని గుండా రోడ్డు పడితేకాని కాలవ వొంతినకు సూటిగా రహదారి పడదట, తోట చివరి గోడ పడగొట్టి ఆకాస్త దూరం తిన్నగా కలవరేవుదగ్గరకి రోడ్డువేసి, అక్కడ వంతెన కడతారట, కుటుంబయ్యగారు పేచీ పెట్టకుండా ఈ అధ్యక్ష పదవి ఎఱగా వేస్తున్నారు. ఆ యన్ని వొప్పించే భారం, నాపైనా మీపైనా కూడా వుంది.

రామ : పెద్ద చిక్కే. వో పట్టాన స్థలం వొదిలేఘటం కాదు కుటుంబయ్య. ఆసామికి డబ్బవసరం. — ప్రభుత్వం ఏదో ముట్టచెప్పుతుందిగా — స్థలం లాక్కున్నందుకు — ఇదుగో — శాంతా — ఇటురా — (శాంతమ్మ వొకడుగు ముందుకేస్తుంది. చెవిలో ఏదో చెప్పబోతుండగా. దానయ్య. సకిలిస్తూ, దగ్గుతూ ప్రవేసిస్తాడు)

దానయ్య : ఎవరుబాబూ — యువక దంపతులా. పరంధామయ్యగారి లోగిలిదేనా బాబూ — ?

రామ : రెండు ప్రశ్నలు. మొదటివానికి సమాధానం కాదని. రెండోదానికి అవునని.

దాన : దంపతులు కారా బాబూ !—— అల్లా కనబడితే అల్లా అన్నాను. పోనీ అల్లాఅవాలని దీవించవొచ్చా పెద్దముండావాణ్ణి.

శాంత : వారు రామయోగి గారని — లక్ష్మయ్యగారి కుమారులు — లా చదువుతున్నారు — నేను శాంతమ్మని — ఇక్కడ సంక్షేమ కేంద్రంలో గ్రామసేవికను. తమరెవరో ....

దాన : భేషుగ్గా అడగొచ్చు — ఎరగని వాళ్ళంటూవుంటే, వాళ్ళు దానయ్యని చెప్పుకుంటారు. పరంధామయ్యగారికోసంవొచ్చాను. ఈ గ్రామానికి ఇదే తొలిసారి రావడం. మెడలోతు ఊబిలోంచి బల్లకట్టుమీదికి ప్రసన్నాంజనేయులుగా కుప్పిగంతేసి ఈ లోగిలి చేరేప్పటికి తలమీద ప్రాణం. తోకమీదికి — జార బోతుండగా మీ జోడీని చూడగానే — మీ అన్యోన్యం, అప్యాయం, ఈడుజోడు, అందం చందం చూసేసరికి, మళ్లా తలా తోక ఏకమై ఆ రెంటిమధ్య ఈ ప్రాణి కుదుటపడి సేద తీర్చు కుంటోంది బాబు.

రామ : ఎంత దండకం చదివావయ్యా. ఆ దీవనమాత్రం ప్రయో గించకండి. ఆమెకి ఉద్యోగంలో ప్రమోషన్ రావాలనీ, నా లా పరిక్షప్యాసై ప్లీడరీపట్టా పుచ్చుకోవాలనీ దీవించండి.

దాన : సర్వనదులూ సముద్రంలో కలిసినట్లు ఈ చదువులు, సంపదలూ అన్నీ వివాహంలో అంతమొందాల్సిందే. సంతానం అందులో కెరటాలు. — జాతకాలు పడెయ్యండి. అస లొచ్చింది ఆ పనిమీదే.

రామ : వాట్ — కొంపమునిగింది. ఎ మారేజ్ బ్రోకర్ ! కళ్యాణాల కిరాయి వ్యాపారమా.

దాన : ఇంకా సందేహం ఏమిటి ? కట్నాల విషయం పట్టింపులు పోమాకండి — రాట్నమొడుకనివాడు, కట్నం కామించినవాడు పట్నంలో పందికొక్కై పుట్టును కాటంరాజా (పద్యంగా చదువుతాడు)

శాంత : (నవ్వు ఆపుకుని) మీరొచ్చింది పరంధామయ్యగారి కోసమే కదా. వారు ఊళ్ళోలేరు. సాయంత్రాని కొస్తారేమో.

దాన : పోనీ వొచ్చినప్పుడే దర్శనం చేసుకుంటాను. వారికి సంతానం ఎందరో.

శాంత : వారికి సంతానం లేరు.

దాన : లేరు అన్న పదం ఎప్పుడూ వాడకు తల్లీ — నా నోట ఆ మాట వొచ్చిందంటే వుండి తీరతారు — ఇద్దరేసి చొప్పున, డజనుమంది కవలలు పడేళ్ళు తిరక్కుండా —

రామ : ఏమిటి రెండు పంచవర్ష ప్రణాళికలు తయారు చేసిన ట్టున్నారే ! ఈ దీవనలే భరతమాతని కుంగదీశాయి. ఒక భారత మాతేమిటి — మొత్తం భూదేవి దిగజారిపోతూంది. అంతర్జాతీయ సమితిపేరు విన్నారా ?

దాన : అది సర్వాంతర్యామి అయిం తర్వాత, నా చెవిని విడిచి పెడుతుందా—

రామ : వారు తయారు చేసిన లెక్కల ప్రకారం నిమిషానికి 170 మంది పుడుతున్నారు ప్రపంచంలో. నిమిషానికి 90 మంది మరణిస్తున్నారు. నిమిషానికి 80 కొత్త ప్రాణులు దాపు రిస్తున్నాయి ... ప్రస్తుతం ప్రపంచం మొత్తం జనాభా రెండు వందల డెబ్బైకోట్ల, నివాస యోగ్యమైన భూభాగం వైశాల్యం 5 కోట్ల 55 లక్షల చదరపు మైళ్లు నిమిషానికి పుట్టేజనం, మరణించే జనం లెక్కప్రకారం చూస్తే రోజుకి 1 లక్ష 20 వేలమంది చొప్పున ప్రపంచ జనాభా పెరిగి పోతూంది. నేను మీతో ఈ మాటలు చెప్పేలోగా — అప్పుడే వెయ్యిమంది వుట్టారు ....

దాన : (అటుఇటు చూసి) ఏరి — ఏరి ? .... బాబోయ్ భయమే స్తోంది. ఇదంతా ఎందుకు చెబుతున్నట్లు ?

శాంత : వారు చెప్పబొయ్యే ఉపన్యాసంలో భాగం. మళ్ళా మరచి పోకుండా — మీ ముందు రిహార్సల్ ....

దాన : నాముందా — ! అసలే మతిమరుపుకి అంతర్జాతీయ సమితిలో కూడా పేరు మోగిన ఘటాన్ని. అవుతే — ఈ విధంగా పుడు తూండడం మరణిస్తూండడం — అనాదినుండీ వొస్తున్నదా — లేక కేవలం, ఈ మధ్యనే ప్రారంభమైందా ?

రామ : అనాదిగా వొస్తున్నదేకాని .... ఆధునిక విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి చెందినకొద్దీ మానవుడి ఆరోగ్యం సుఖం, మరింత సమకూరుతోంది — మరింత తింటున్నారు — మరికొంత మందిని కంటున్నారు — మరి కొన్నాళ్లు జీవిస్తున్నారు.

శాంత : అది నే ఒప్పుగోను స్మాండి. పూర్వంవాళ్ళే ఎక్కువ కాలం బ్రదికే వాళ్ళని చెప్తుంటారు.

రామ : ఏం బ్రతుకో — జీవచ్ఛవంబువోలె — మనిషి ఎంతకాలం జీవించాడన్నది ముఖ్యంకాదు — ఎల్లా జీవించాడు అన్నది ముఖ్యం. ఇప్పుడు ప్రపంచం అంతటా కలిపితే సమకూరే భోజన పదార్థాలు, ఆరు వందలకోట్ల మందికి సరిపోతాయి.

ఇప్పుడు సాగుతున్న స్థాయిని బట్టి మరో నూటనలభై ఏళ్ళకి ప్రపంచ జనసంఖ్య ఆరువందల కోట్లవుతుంది. ఆనాటికి, తినేటందుకు ఏమీ వుండదన్నమాట. ఖగోళ శాస్త్రజ్ఞులు కొన్నికోట్ల సంవత్సరాల తర్వాత, సూర్యుడు వేడిని గోల్పోయి కొవ్వొత్తి లాగైననాడు, భూగోళంలో ప్రాణులు నశింపు అవుతాయి అంటున్నారు, పదార్థాల కొరతవల్ల. మన మునిమనమలు, పూర్వీకుల తెలివి తక్కువ తనంవల్ల నశింపవుతారు. — మరో అవాంతరంవొచ్చి, భగవంతుడు స్వర్గంలో పేకాడుతూ, రెండు బేస్తులు కొట్టేసిన హుషారులో మళ్లా కలగజేసుకుని మరోమార్గం కనిబెడితేతప్ప.

దాన : హైరాణ పడ్డావు. కాస్త మంచితీర్థం పుచ్చుకోబాబు. జనన మరణాలు మనచేతిలో వానాయినా? అంతా దైవ సంకల్పం.– పరమాత్మ కటాక్షం. రేపు నీకు వివాహమై, మొగ శిశువు కన్నప్పుడు, ఈ లెక్కలు, జాబితాలు ఎల్లావేస్తావో నేను మాత్రం వొచ్చిచూడనా ఏమిటి? సిగ్గుపడుతున్నావా — తల్లీ.! పోనీ అననులే.

శాంత : రామయోగిగారికి పెండ్లి చేసుకునే ఉద్దేశం లేదండి. ఆదర్శాలు సాధించి, సంఘసేవ చెయ్యదల్చినవారికి, వేరే సంసారం, క్షోభ వుండకూడదని వారి తత్వం.

రామ : బాగా చెప్పావ్ శాంత — అంతర్జాతీయ వ్యవహారాలపట్ల ఎక్కువ కుతూహలం కనబరిస్తే, వంటింట్లో అవతరించిన పేచీపిల్లనే అంటూండేవాడు మా ప్రొఫెసర్. ఇంతకు తమకి సంతానం ఎందరో అడగొచ్చా?

దాన : అడిగావు — చంపేశావ్. పెద్దాడు, స్కూలుమాస్టరు; వాడికి నలుగురు; రెండోది వివాహం అయిన రెండోఏటే — ఏం చెప్పను? విధికృప — మూడోవాడు షరాబు. నాలుగోది అత్తిపొడు కరణం కోడలు. ఐదోవాడు ....

రామ : యక్కాల పుస్తకం అందరూ చంపక కానిమంచిక్రమం కనబరిచారు. — ప్రభుత్వానికి ప్రతిగా కుటుంబ క్రమ వ్యుత్పత్తి పథకం వొకటి తయారుచేసి చూపించారు. మగ, ఆడ, మగ, ఆడ, — మంచి రిధిమ్, లయ — వున్నాయి. కుటుంబయ్యగారు వొప్పుకోని పక్షంలో మిమ్మల్ని అధ్యక్షులుగా చెయ్యమని మా బ్లాక్ హెడ్స్‌ని — అంటే బ్లాక్ అధికార్లని — క్షమించు శాంతాదేవీ — కోరతాను. — ఇప్పుడే వెళ్లి — ఇదె పోవుచున్నాడ.

శాంత : నేనూ వస్తానుండండి. ముందు కుటుంబయ్యగారింటికెడదామా? వారిల్లు శుభ్రంచేసే ప్రోగ్రాం వేసుకున్నాను. వాళ్ళ లక్ష్మికూడా నాకోసం కనిపెట్టుకుని వుంటుంది. (వెడుతుంది)

దాన : రామయోగి బాబూ — కుటుంబయ్య పేరు రెండుసార్లు విన్నాను. ఎక్కడ విన్నానబ్బా అనుకుంటున్నాను. ఎందుకంటే, — నే వొచ్చింది ఆకుటుంబయ్యగారి కోసమే. — ఇందాక ఏమన్నాను? పరంధామయ్యకోసం అన్నాను, అవునా? కాదు. మరిచాను. ఇప్పుడు జ్ఞాపకం వొచ్చింది. నే వొచ్చింది నిక్కచ్చిగా కుటుంబయ్య కోసమే.

రామ : మరి పరంధామయ్య పేరు మీకెల్లా తెలిసింది?

దాన : అదీ జ్ఞాపకం వొస్తోంది. వొచ్చేసింది. అవధాన్లు పంపగా వొచ్చాను. పరంధామయ్య లోగిలి పక్కలోగిలి కుటుంబయ్యది. అన్నాడు. ఆ రెండూ కలిసే వుంటాయి. —

రామ : ఆ వొచ్చేదే కుటుంబయ్యగారు....(రామయోగి వెడతాడు)

దాన : వెళ్లాడూ — అవునుమరి — రెండూకలిసే వుంటాయి — (నవ్వుతాడు) కలిసే వుంటాయి. మధ్య పిట్టగోడ అడ్డం — అన్నాడు. (కుటుంబయ్య చేతిలో కర్రతిప్పుతూ కోపంగా ప్రవేశిస్తాడు)

కుటుం : మీకెన్నిసార్లు చెప్పాలండి? — అస్థలం అంతా తోట; వొక్కమొక్క ముట్టుకోనివ్వను. తాతలనాటినుండీ వొచ్చింది. ఈనాటికి మిగిలింది — ఆ జానెడు కొంప్రను తతిమ్మాది తిరుక్షవరమైంది. ఇదేనా దక్కనివ్వండి. పైగా మీరు పథకం అంటూ ఏదో కట్టుకు పోతారు — డామ్ కట్టారంటె. దానికి నదివుందో లేదోకూడా చూసుకోరు. ఏదోవొకటి కట్టెయ్యాలి అశైటమ్‌కి, ఈలోగా ఆ డబ్బు కాస్తా ఖర్చపకుండావుంటె. నా ఇంటివెనుక కాలవకి వంతెన అవసరమా లేదా మీకక్కర్లేదు. వంతెన అని ప్లాన్‌లో వ్రాసుంది, కట్టేస్తారు. నే నది సాగనివ్వను. బల్లకట్టు, పడవలవాళ్ళు ఏమవుతారు? చచ్చింతర్వాత మిగిలి చచ్చేది ఈ జానెడు మట్టి — దుమ్ము ధూళి — ఏముంది ఈ బ్రదుకు?

దాన : హరిహరి — ఎంతమాట వినాల్సి వొచ్చింది — నేను మీ భూమి తాలూకు ఏమీ ముట్టను. మీరు సంతోషంతో నామీద పడేసినా వొద్దు బాబూ అని తిరస్కరిస్తాను. డబ్బు ముట్టక పోవడంలో నాలుగైదు తాలూకాలు పేరుమోసిన ముండావాణి. — అల్పుడను; తుచ్ఛుడను పాపిని. చిత్తగిస్తున్నారా.. ?

కుటుం : సందేహం ఏమిటి ? మీరు వొంతెన మొదలుపెట్టి, సగం అయిం తర్వాత, ఆ డబ్బంతా స్వంతవంటింటి ప్రణాళికకోసం హుళక్కి అయితే· ఆ మిగతా సగం వంతెనా గడ గర్రలు. తాళ్ళతో ముగించి వేస్తారు.

దాన : నేను కర్రలజోలికి పోను స్వామీ — చచ్చిం తర్వాత నే వాటి ప్రమేయం. ఇంకా తాళ్ళంటారా — మా ఇల్లాలి మెడలో ఏనాడో కట్టినతాడు తప్ప, — ఇంతవరకూ ! ఏలాంటి తాటినీ తాకలేదు. — చూడండి — నేను దానయ్యను. అనగా — అవధాన్లు రహస్యంగా పంపిన... మరి ...

కుటుం : (తెల్లబోతాడు. కోపం మందహాసంగా పరిణమిస్తుంది) తమరా — రండి — రండి ఎక్కడనుంచి రావడం? ఏమిటికథ— ఎంత సేపయింది — కాలకృత్యాలు గట్రా సక్రమంగా జరుపుకున్నారా... ఆవేశంలో ఏదో అనేశాను. ఈ గ్రామంలో గ్రామాభివృద్ధి అంటూ వొక గుడారం పెట్టార్లెండి — బహుశా మీ వూళ్ళోకూడా వుండే వుంటుంది.

దాన : చిత్తం, చిత్తం - వొకటేమిటి రెండు లేవదీశారు. ఒకటి స్త్రీలకట - మరోటి మొగాళ్లాకట - అసలు మొగాళ్లంటూ మన దారిలో వున్నట్లు ! ఏముందీ — నలుగురమ్మలక్కలు — పెండ్లి కొంచం కూడా కానివాళ్లు, ఇంకెప్పుడూ అవనివాళ్లు, కాస్తయి విడాకులిచ్చిన వాళ్లు, పుచ్చుకున్నె వాళ్లు, పిల్లలు లేని వాళ్ళు, ముండమోసిన వాళ్లు - లేచొచ్చినవాళ్ళు కొన్నిమాత్రం మనవి వేసుగుంటువ్నా - వీరూ, మరో పదిమంది కొంపంటూలేని సర్రకారూ-పోగవడమున్నూ, వొక జీపెక్కడం, డుర్రుమంటూ నాలుగువీధులూ తిరగడం....

కుటుం : వాళ్లు తిరిగితే ఇబ్బందిలేదు - పట్నాల్లో వాళ్ళకి తిరిగేటందుకు కార్లున్నాయి కాని రోడ్లులేవు. అంచేత ఇక్కడికొచ్చి తిరుగుతారు. ప్రొద్దుటే మన కొంపలమీద పడటం,— రోడ్డంటూ, నూతులంటూ, చెరువులంటూ, వొంతెనలంటూ, ఇంజన్లంటూ, మరలంటూ, పెట్టిస్తున్నాం - పనిలోకి రమ్మంటం పాతికొ పరకో గుంజుకోడం.

నాన : బాగా సెలవిచ్చారు. తమకి తెలియందేముంది - అరుపల్లి గ్రామంలో ఏడాది క్రితం రోడ్డు త్రవ్వడం లంగించుకున్నారు ప్రెసిడెంటుగారి లోగిలిదాటి అడుగు ముందికి రాలేదు. (చెవిలో రహస్యంగా) ఆ మేస్త్రీ వున్నాడుట - మేస్త్రీ మరొక స్త్రీని - అక్కడే ఏదో పన్లో వుందట - దాన్ని దీసుకు పరారి....

కుటుం : జరిగిందీ - అనుకుంటూనే వున్నాను. మొన్నెవరో పై అధికారి తనిఖీకొచ్చాడట. ఇక్కడ జమఖర్చు చిట్టాలు ఆరాతీస్తే ఏముంది - గుటకాయస్వహా-ఆయన ఇవన్నీ బైట పెట్టకుండా - లావుగా మజాచేశారుట. రాత్రంతా విందులు, వినోదాలు, నృత్యాలు, నాటకాలు - దాంతో వాడినోరు కట్టు, మరో గ్రామానికి కేటాయించిన రోడ్డు రోలరు పొరబాటున ఇక్కడి కొచ్చిందనీ - అంచేత ఆ రోడ్డు విడిచేసి, వొంతెన వేసేటందుకు ఉన్నడబ్బు సరిపోతుందనీ కాబట్టి వొంతెన ప్రారంభించమని సూచించి వెళ్ళాడట. అప్పటినుండి,- నా తోట పనిపట్టించారు.

దాన : బాగా వొక బస్తాడు పల్లేరుకాయలు పోయించండి. వొక్క పురుగు చేరదు ఆ చుట్టు పక్కలకి.

కుటుం : దీనికేం లేండి - ఇది దేశమంతటా జరుగుతున్న వింతే గనక నేనూ మీరూ వాపోవనక్కర్లేదు, ఇంతకీ అవధాన్లుగారు, విషయం ఏమన్నా పైసలు చేశారా ?

దాన : వారు తల్చుకున్నాక తిరుగేమిటి ? ఆ చుట్ట పక్కల వొంద మైళ్ళ ఆవరణలో ఆమాత్రం మోతబరిదారు లేడు - ఏ ఏమాట కామాటేఅనాలి ఈ గ్రామ పునరుద్ధరణ శాఖవాళ్ళు ఏ దినవారం సంకల్పించినా ప్రారంభోత్సవం నాటి వైదిక కర్మలు సర్వమూ అవధాన్లు జరిపించాల్సిందే (చెవిలో) ఈ మధ్య రెండు అపభ్రంశపు వివాహకాండలు కూడా జరిపించాడు. ఉభయులూ కట్నాలుచ్చుగోక, ఆసొమ్ము అవధాన్లుకే ముట్టచెప్పారు. అందకని ఈ ప్రణాళికల్ని తెగమెచ్చుగుంటాడు అవధాన్లు - సంకల్పంలో ఎక్కడో అక్కడ ఈ ప్రణాళిక స్తోత్రాన్ని ఇరికిస్తాడు. ఇదంతా వేదాలలో ఏనాడో వ్రాశుక్కచ్చారుట. శిష్యగణంలో వాణ్ణిగనక నాకూ అబ్బింది స్మాండి - చెప్పొద్దూ! ప్రస్తుతం కళ్యాణాలు చేయించేస్తున్నాడు- కనబడ్డ జోడాకల్లా, వధూవరులంతా ఈ కేంద్రాల్లో దొరుకుతున్నారు.

కుటుం : హరి హరి - ఎంతపని జరుగుతోంది. అందుకనే మాలక్ష్మిని ఆ చుట్టుపక్కలకి పోవద్దంటున్నాను. అందులో జేరి నాటకాలాడు తుందిట - ఉద్యోగం వెలిగిస్తుందిట - మీరూ బాగా నామకరణం చేశారు - దినవారాలని - ఏదోవొకటి కనిపిస్తుంది వీళ్ళకి.— ఎరువులు తినవునేవారం, విత్తనాలవారం, పెంట ముతాచేరి పారిశుధ్యవారం, బైరాగులు చేరి పొదుపు

వారం, శైళ్లవారం, అడివివారం, జాలివారం,- ఇంక రోజులు జరుపుతారు.- సంతోషం రోజు, ఏడుపురోజు, పస్తురోజు, ప్రొజెక్టు మొదలెట్టిన రోజు, మధ్యలో ఆగిపోయిన రోజు - చివరికి పీకేసిన రోజు - ఈ విధంగా ప్రజని ఉక్కిరి బిక్కిరి చేసేస్తున్నారు. రేపో మాపో, నిర్ణీత కుటుంబంవారమట - నాటకాలుట, బుర్ర కథలుట, మా లక్ష్మి అందులో వేషం వేస్తుందిట - మా తిరుమలగాడున్నాడు - వాడికో సైకిలిస్తే బ్రతికున్నాడో లేడో రోజు రోజు వాకబు చేస్తుండాలి - వాడూ అక్కడే మకాం - ఏం చెప్పమంటారు ?

దాన : పోనీ మన సంతానాన్ని హాయిగా వాళ్లు పెంచినా బావుండును. ఈరొంపిలో పడకుండా మన సంతాన రత్నాలని మరో ప్రాంతం పంపిద్దామంటే అక్కడా తగులడ్డాయిగా ఈబాకులు పురోభి గుద్దులూనూ. అసలు విషయం చెప్పనీయండి - లేకపోతే మళ్లా మరిచిపోతా - శుక్రుడు ద్వితీయ స్థానమందు, అద్వితీయంగా పనిచేస్తున్నాడు గావున. శనికి ఆశ్రయమిస్తూ కుజుడు నాలుగోస్థానమందు, స్థావరమై యున్నాడు గావున పదిమాసాలు పూర్తికాకుండానే మగ శిశువో, తప్పితే ఆడ శిశువో తప్పదుట !

కుటుం : బాబూ ఇప్పుడున్న సంతానం చాలకనా ?

దాన : తొందరపడకండి సంతానం లేకపోడానికి కారణం సర్ప దోషంటా కాని వారిసతీమణి పదేళ్లుగా పుట్టలో పాలుపోస్తూండడంవల్ల.

కుటుం : ఏమిటయ్యా నువ్వు చెబుతూన్నది — సంతానం లేకపోవడమేమిటి ? సతీమణేమిటి ?

దాన : వాక్యం పూర్తి కానివ్వండి స్వామి, — వారి సతీమణి పదేళ్లుగా పుట్టలో పాలుపోస్తూండడంవల్ల పూర్వజన్మ పాపం పరిష్కృతమై మళ్లా సంవత్సరానికి సంతానయోగం వ్రాసిపడేశాడు, పరంధామయ్యగారి చిట్టాలో—

కుటుం : అమ్మయ్య — పరంధామయ్యకా — అతనికి సంతానం కలగాలని నేను నిత్యమూ ప్రార్థిస్తూనే వున్నాను. కాని ఆ దంపతులకి లేరన్న బెంగేలేదు చిత్రం ! మావాణ్ణి పెంచుకోమన్నాను. సుముఖంగాలేదు వారికింకా ఆ ఆశవుండడం సహజమే.

దాన : ఉండండి — నేనిందాకటినుండీ చెపుతున్నది పరంధామయ్యగారి సంతానం విషయం — ఏమిటో మతిలేసుస్మాండి — మీరే పరంధామయ్య గారన్నట్లుగా — పొరబాటు — ఇంక మీ విషయం — చెప్తా. ( వేళ్లుమడుస్తు లెక్కలు కడతాడు ) అంతే — వొక్క ఐదొందలు పడెయ్యంచండి సర్వమూ చక్కబడతాయి.

కుటుం : దానికేముంది. అవి ముందే ఏర్పాటు చేశాను. — ఇంతకీ ....

దాన : అమ్మాయి దివ్యంగా వుంటుంది — నేను చూశ్లేదనుకోండి — చూసిపోదామని పై ఊళ్లనుండి జనం తీర్థ ప్రజలా వొచ్చిపోతూంటారుట ! వారు బాగా ఉన్నవారులెండి — మంచి స్థితిపరులు — పొదుగు ఉద్యమ ప్రచారం సందర్భంలో — పొదుగేమిటి నా బుర్ర — పొదుపు — జాతీయ సేవింగుకై ఐదువేలిచ్చి పత్రాలు కొన్నారుట. — వారిని అధికారులు ఊరేగించారు. మళ్ల ఎందులోనో పడికొట్టుకుపోకుండా, చెప్పనీయండి — కట్నం పదివేలు —

కుటుం : బాగుంది — కట్నం తీసుకోగూడదనుకోండి — అయినా వారిమాట తోసివెయ్యడం కూడా అంత మంచిది కాదేమో —

దాన : మీరు తీసుకోకుంటే, మరో కథలకనో కార్యానికనో ఈ గ్రామ పునరుద్ధరణ శాఖవారి కైంకర్యం అయిపోదుటండీ. — ఎవళ్లకిపోసినట్లు సొమ్ము ? కావున, ఈ విషయంలో తమరు పట్టింపులకి పోక, స్వీకరించి, భావి పౌరుల ఆనందానికి...

కుటుం : (వాక్యంపూర్తవకుండా) బాగా సెలవిచ్చారు. ఆ పదిలో వెయ్యి అవధాన్లుగారిదే కదా - కూస్తో కూస్తో మీకు ముట్టాలి కదా -

దాన : నేనీవిషయంలో నన్ను ముట్టుకోకు నామాలకాకి లాంటి వాణ్ణి. నాపేరు దానయ్య. అనగా - 'దా' అనగా దాగగాలు - న అనగా 'నహి' — ఎఱుగని 'య్య' అనగా 'వియ్యానికి' ఏర్పాటు చేసే దానయ్య అని పెద్దల తాత్పర్యం. కానైతే వారు కొన్ని కోరికలు కోరారు. అనగా నామకరణం చేసిన పెద్దలు కాదుస్మాండి ముచ్చట, మురిపెం, ఐదురోజులు జరగాలన్నారు. అక్కడ మూడు రోజులు - ఇక్కడ రెండు రోజులు ....

( వ్రేళ్లవిడుస్తూ లెక్క పెడుతాడు )

కుటుం: ఎవరో వొస్తున్నారు. కంఠం తగ్గించండి. (సౌంజ్ఞచేస్తాడు)

దాన : నాకట్లాటి భయాలు లేవండోయ్ - శుభ కార్యం తల పెట్టాం. కొండెక్కి కోడై. కూయమన్నాడు శాస్త్రకారుడు. దివ్యమైన సంబంధం - స్థిరపడిపోతుంది ( రామయోగి, వొక వైపునుండీ, శాంతమ్మ మరోవైపునుండీ ప్రవేసిస్తారు)

రామ : ఆ శుభవార్త మాచెవినికూడా పడెయ్యండి.

కుటుం : ( వొద్దన్నట్లుగా సౌంజ్ఞచేస్తూ ) ఏముంటుంది - వారి వూళ్లో పైసలైన సంబంధాల విపరాలు చెపుతున్నారు. మరో శుభవార్త ఏమిటంటే, పరంధామయ్యకి మళ్లా ఏడాది తిర క్కుండా సంతానమట.

రామ : దిసీజ్ బ్యాడ్ న్యూస్ ఫర్ ది వరల్డ్! ప్రపంచానికి అరిష్టం. పరంధామయ్య బుద్ధిమంతుడనీ నిదానం గలవాడనీ అనుకు న్నాను. ఈ అఘాయిత్యానికి వొడిగట్టాడా ? రానీయండి కనుక్కుంటాను.

దాన : ఇంక ఐదురోజులూ జరగవల్సిన కార్యకలాపం....

కుటుం : ( వొద్దన్నట్లుగా సంజ్ఞచేస్తూ ) పరంధామయ్య, ఐదు రోజులేమిటి, — ఐదు వారాలు విందులు చేస్తాడు. సంతానం కలిగితే.

శాంత : ఆయనకి పిల్లలుండితీరాలి - స్థితిపరుడు, సంస్కారి - సక్రమంగా పెంచి, సజ్జనులను సంఘానికి వొప్పగిస్తానంటే అది అశుభంగా పరిగణించడం నాకూనచ్చలేదు, యోగిగారు.

దాన : బాగాచెప్పావ్, చిన్నదానివైనా; జనమే దేశం - ఏమిటను కున్నారో - శుభం పలకరా మంకెన్నా అంటె - అన్న సామ్యంగా వుంది. సజ్జనులైనా, దుర్జనులైనా భరించాల్సిందే - ఇదేమన్నా వంకాయల బేరమా - పుచ్చొంకాయగా కనబడిన దాన్ని, తీసి పారెయ్యడానికి !

రామ : తప్పకుండా వంకాయబేరమే. దానికి దీనికీ సంబంధం వుంది. అసలు వొకదాన్నుండి మరొకటి విడదియ్య డానికి వీల్లేదు. చూడండి - నిన్న రాత్రి మీ ఇంట్లో గుత్తొంకాయ కూర వొండి తిన్నారంటే - అదెట్లా సాధ్యమైందని ?

దాన : ఆవిడ వెలపలుండి - నేనే స్వయంగా వొండానుగావున.

రామ : మీ కూర తిన్నవారు బ్రతికివున్నారు గావున బాగానే వొండి వుంటారు. అదికాదు విషయం. అసలు మీకావొంకాయ ఎల్లా వొచ్చింది - ? రంగమ్మ తోట్లోది వంకాయ. నీళ్లపోసి, నేలని బలంచేసింది - అందుకు ఎరువులు కలకత్తానుండి రైల్లో రావాలి. రైలు సకాలానికి రావాలంటే మధ్యలో వరదల ఎల్ల గండ్లుపడి రైలు మార్గం చెడకూడదు. కలకత్తాలో ఎఱువుల కర్మాగారం నడిపే ఇంజనీరు మామ స్విట్జర్లండ్‌లో వున్నాడు. స్విట్జర్లండ్‌లో పనిచేసే కూలీలు సమ్మెచెయ్యకూడదు. అక్కడి నుండి కర్మాగారానికి కావాల్సిన సరుకు ఎగుమతి అవాలంటే డాలర్ ఎక్స్చేంజ్ ఏర్పాటుండాలి. అది వుండాలంటే, యుద్ధం వుండకూడదు. యుద్ధాలు జరక్కుండా. అంతర్జాతీయ సమితి సదా కృషిచెయ్యాలి. అల్లా వొకదానికొకటి లంకెగా ముడిపడింది ఈ నాటిజగత్తు !

కుటుం : భయంగావుంది ఇదంతా వింటుంటే —

శాంత : ఏమీ భయపడకండి. రామయోగిగారు గొలుసుతత్వం అనే గ్రంథం తలపెట్టారు. ఒక తత్వం స్వీకరించాక, ప్రతిదీ దానికి అమిరినట్లుగా వుంటుంది. అంచేత అల్లా చెప్తుంటారు. పరంధామయ్యగారికి సంతానం కలిగితే, ఈ గ్రామానికి ఎంత మేలు సమకూరుతుందో చెప్పలేను. నిత్యకళ్యాణం. పచ్చ తోరణంలా వుంటుంది. ఆ సంతోషంలో వారు సేవింగ్స్ సర్టిఫికెట్లు కొనేస్తారు. వంతెన నిర్మాణానికి మనిషిబలం, సంపత్తి బలంకూడా ఇస్తారు. పెద్దపార్టీ ఇస్తారు. బీదలకి అన్నదానాలు జరుపుతారు. నీరసించిన మాబ్లాక్ వారికి కొత్త ఉత్సాహం, ఇచ్చినవారవుతారు, మన ప్రణాళిక కొనసాగి, తలపెట్టిన కార్యక్రమం చురుకుగా నడవాలంటే పరంధామయ్యగారు కనడమే శరణ్యం — ఐ మీన్ — వారి సతీమణి — ఉభయత్రాను.

కుటుం : నువ్వు వెయ్యికాలాలు వర్ధిల్లుతావు శాంతమ్మ.

దాన : గంపెడు పిల్లల్ని కంటావు

రామ : ఘోరం, ఘోరం — ఓమూల పెండ్లయినా కాలేదు — అల్లేదు, చూల్లేదు — కొడుకుపేరు.

దాన : నాపేరు పెట్టించండి.

రామ : ఇంతకీ పరంధామయ్యగారి సంతానం విషయం డాక్టర్లు నిర్ణయించిన చిహ్నాలు ఏమన్నా వున్నయ్యా లేక ....

దాన : నాకు తెలిసినంతవరకూ అవిధాన్ని కట్టిన జాతకం లెక్కల ప్రకారం అల్లావుందిట.

రామ : అమ్మయ్య – నిజమనుకుని హడిలి పొయ్యాను. ఇది ఆంధ్రదేశానికి, భరత ఖండానికి, ప్రపంచానికీకూడా శుభవార్త

కుటుం : సంతానం కల్గ – పోవడమా ? బాగుంది నాయనా — మంచి ప్రచారానికే పూనుకున్నావు.

రామ : మీరూ, నేనూ పరంధామయ్య అన్నవిషయం కాసేపు మర్చిపోండి. – స్వార్థాలని విడిచిపెట్టి, ఇది సబబో కాదో మీరే చెప్పండి. ప్రపంచంలో దేశాలన్నింటిలోనూ ఎక్కువ జనాభా గలదేశం చైనా. రెండోది మనదేశం. 1901 నాటి జనాభా లెక్కల ప్రకారం – మనదేశపు జనసంఖ్య 28¼కోట్లు. పాకిస్తాన్ మినహాయిస్తే, ఈనాటి జనాభా ఎంతని ? వేళ్ళు. మడవండి దానయ్యగారూ, 356879394 – పరంధామయ్యకి కలగబొయ్యే కవల పిల్లల్ని కలిపి 356879396. ఈ గ్రామంలో ఇప్పుడు కవలపిల్లలు పుట్టారంటే ఏం జరుగుతుందో గమనించండి. అలాస్కాలో 30 కుటుంబాలు, న్యూజీలండ్‌లో రెండు సంసారాలు, సింహళంలో వందమందికి పైగా తిండి కొరతవుతుంది. ఈజిప్టులో ఇద్దరికి ఉద్యోగాలు దొరకవు,– వారిమీద ఆధారపడిన ఇరవైమంది,– మరో ఇరవై ఏళ్ళకి పస్తు. ఇది నశింపు కాదంటారా ? ఇది హత్య. పరంధామయ్య గారు, హంతకుడు, వారి సతీమణి మద్దతు – ఇంగ్లీషులో — ఏక్సెసరీ ఆఫ్టర్ ది ఫాక్టు – వెంటనే వొకచట్టం అమలు జరిపించైనా పెరిగి పోతూన్న సంతానాన్ని నిరోధించాలి.

దాన : దారుణం – సంతానాపేక్ష లేకపోతే అసలు పెళ్ళిదేనికి బాబూ. అపుత్రస్య గతిర్నాస్తి–అన్న విశ్వాసాన్ని జందెంతో పాటు విసర్జించ మంటావా ?

కుటుం : బాగా అడిగారు. ఇంటినిండా పిల్లలుండాలి - వార్ని చూసేటందుకు ఇల్లా లుండాలి.

శాంత : రామయోగి గారిది అతివాదంగా కనబడుతోంది. పోషించలేని సంతానాన్ని తీసుకు రావడం సమాజంపట్లనేరం అనుకోవొచ్చుకాని,- ఆర్థిక స్థోమత గలిగి పోషించ గలిగితే సంతానం వొద్దని - ఏ ప్రభుత్వమూ అనలేదు.

రామ : మూఢ విశ్వాసాలతో మూల్గు తున్నమన ప్రజకి అతివాదం కాని బుర్రకెక్కదు. ఆదాయం, వయస్సు, ఆరోగ్యం - వాటిని బట్టి కుటుంబం నిర్ణీతమై వుండాలన్నది మంచి సూత్రం కాని అది సూక్ష్మమైంది - పరంధామయ్యగారి పట్ల నా అతివాదం అంగీకరించాలని బలవంతం చెయ్యను - రైట్. వొక్కహామీ ఇవ్వండి. ఇద్దరు సంతానంతో నిలిచి పోతుందంటావా ?

శాంత : ఏమో బాబు,- అంత పచ్చిగా అడిగితే నేనేం చెప్పను !

దాన : ఎవరు మాత్రం ఏంచెప్పగలరు ?

రామ : కనిపారేసి పరమాత్మ కటాక్షం అనడం పరిపాటైంది. ఓ పట్టాన పుట్టడం మొదలెడితే ఇంత ఆగడం వుండదు.- ముఖ్యంగా ట్రాపికల్ దేశాల్లో - ఉష్ణం జాస్తిగావున్న మన ప్రాంతాల్లో - ఏటేటా సకాలానికి వర్షాలు పడినట్లు - కుటుంబయ్యగార్ని చూడండి.

కుటుం : నవగ్రహాలల్లే తొమ్మండుగురు-రెండోవాడు పోకపోతే–

రామ : ఆయనకింకా 45 దాటలేదు. మోసి, కని, పెంచి, శరీరం, గుల్ల చేసుకుని, సంసారంకోసం బలై పోయింది మహాఇల్లాలు. నలభై నిండకుండా. ఆవిడకు జీవితం అంటే ఏం తెలుసు ? సుఖం ఎరగదు. విరామం, వినోదం, వికాసం, విజ్ఞానం — ఏమీ ఎరుగదు. అది ఆత్మహత్య. ఇంక పిల్లలవిషయం — చదువులేదు, ఉద్యోగం లేదు – వాళ్ళని ఏం చెయ్యాలో తెలీదు. తమని కన్నందుకు పెద్దలని వారూ, పుట్టినందుకు వారిని పెద్దలూ అనుక్షణమూ ఆడి పోసుకుని, మిగిలిన ఆస్తికోసం, ఖూనీలు, కోర్టులు – ఈ సంసార సాగరం, మధ్యలో నిలబడి, కుటుంబయ్యగారు కనక, మళ్లా వివాహం తలబెడితే ....
(కుటుంబయ్య 'హాచ్' అని పెద్దగా తుమ్ముతాడు. దానయ్యా అదిరి పడతాడు. మళ్ళామళ్ళా తుమ్ముతాడు)

దాన : జలుబా బాబూ, కాస్తంత పొడుం ఇస్తునా ?

శాంత : కుటుంబయ్యగారూ, నే వొచ్చినవిషయం చెప్పనేలేదు. ఈపూట మీ అందరి భోజనం మా సమాజంలోనే.

దాన : కొడుకులు, కోడళ్ళు, కూతుళ్ళు వుండగా ఎక్కడో భోజనం చేసే కర్మమేం పట్టింది ఆయనకు ?

కుటుం : ఎంతమందుండేం లాభమండి. – చెడిపోవడం తమ వొక్కరి హక్కే అనుకుంటారు పిన్నలు. సతుకులకనివారు, అత్తవారింటికి వీరు నడుస్తారు. నట్ట నడుంగా సముద్రంలో తెర చాపలేని పడవగా నేను వొక్కణ్ణి–

దాన : ఆ లోటుకాస్తా తీర్చెయ్య మంటారా ఏమిటి ?

(కుటుంబయ్య హాచి మని తుమ్మి బల్లమీద వొరిగి పోతాడు. — గుండెమీద చెయ్యి వేసుకుని దగ్గుతూ బాధ ప్రకటిస్తాడు)

దాన : ఇదేమిటి — ఇట్లాగయ్యారు. కాసిని మంచి తీర్థం తీసుకురా తల్లీ.

రామ : ఉండండి — డాక్టర్ని తెస్తాను. (వెడతాడు)

కాంత : ఇదిగో నీళ్లు - లక్ష్మిని పిలుచుకొస్తాను. (వెడుతుంది)

(దానయ్య దిగులుగా కూర్చుని వెన్ను చరిచి ,సపర్యలు చేస్తూంటాడు. రెండు మూడు నిమిషాలయ్యాక కుటంబయ్య వొక్కసారిగా లేచి, అతిశయోక్తిగా చాలాసేపు నవ్వు సాగి స్తాడు)

దాన : అదేమిటి కుటుంబయ్యగారూ — వొంట్లో ఎల్లావుంది? అల్లా నవ్వుతారేమిటి ?

కుటుం : నిక్షేపంలా వుంది—దానవావధాన్లు. సంభాషణ ప్రమాదంగా మారుతోంది—మాట తప్పించి వేద్దామని తుమ్ములలో ప్రయత్నించాను. కొంత పని జరిగింది. మళ్లా ప్రమాదంగా పరిణమించే స్థితిలో—ఇదొకటే మార్గం. వాళ్లకి ఈ విషయం తెలియకూడదు. అన్నీ స్థిరపడి, ఆ మూడు ముళ్లూ పడతాయన్నప్పుడే నలుగురికీ తెలియడం. మీకు తెలిసిందా ?

దాన : తెలిసిందనుకోండి—పూర్తిగా అవగాహన అవలేదు. పెళ్లి విషయం ఎందుకు రహస్యంగా వుంచాలో నా ఊహకి అంద నిది. అయినా, సంసారంలో అనేకం వుంటాయి. నేనైతే లోతుగా గునపంతోత వ్వేకుటంకాను—ఆ ఐదొందలు పడేస్తిరా సెలవు తీసుకుంటా. ఇంకా గుర్నాధంగారి 'గ్రామం వెళ్లాలి. రెండు మైళ్లట.

కుటుం : ఏర్పాటు చేశాను. మీరు ఆ గ్రామంలో పని చూసుకుని తిరుగొచ్చి మా బల్లకట్టు దాటి వెళ్లేటప్పటికి అందజేస్తాను. సరా ?

(దానయ్య వెడతాడు. కుటుంబయ్య మళ్ళా బల్లమీద కూలబడి వుంటాడు సీనయ్య ప్రవేశిస్తాడు)

సీన : అయ్యగారూ అయ్యగారు. ఏంటిల్లా వొరిగిల్లారు ?

కుటుం : ఓరే నువ్వొట్రా సీనయ్యా. నీ కోసమే చూస్తున్నా.— అవధాన్లు పంపిన మనిషి ఇప్పుడే వెళ్లాడు. మళ్లా వస్తాడు— కొంత డబ్బు వాడిమొహాన తగలెయ్యాలి—బేరం ఏమన్నా...

(వాక్యం పూర్తి కాకుండా లక్ష్మి వొస్తుంది)

లక్ష్మి : నాన్నా—ఏమిటి? ఎల్లావుంది? ఆయాసంలో పడిపోయ్యావుట. ఇప్పుడెల్లా వుంది ? రా ఇంటికెడదాం.

కుటుం : ఇప్పుడు బాగానే వుందమ్మా—ఏదో మైకంలా వొచ్చింది. మనోవ్యాధికి మందు లేదుగా—ఒరేయ్ సీనయ్యా ప్రతాపం గారు ఏమన్నా కబురు చేశారా ? ఉత్తరా లొచ్చాయేమో కనుక్కురా.

సీన : సిత్తం. (వెడతాడు)

లక్ష్మి : మనోవ్యాధెందుకు నాన్నా ?

కుటుం : నువ్వొ సమాజం వాళ్లతో నాటకాలెయ్యకూడదు లక్ష్మి. అక్కడ వయస్సులో వున్న మొగాళ్లుంటారు. కాలం మంచిది కాదు. నీకింకా పెళ్లికావాలి. ఇల్లా తిరుగుతున్నావని నలుగురు చెప్పకుంటె సంబంధా లొస్తయ్యా—అసలే తల్లిలేని పిల్లవి.

లక్ష్మి : నాకు సంబంధాలు రాకపోతే దిగులులేదు నాన్నా. కాంతమ్మలా, ఏదో ఉద్యోగంలో చేరతాను. నాకు పెళ్లి కాకపోతే వొచ్చిన లోటేమీలేదు. వాళ్లు వేసే నాటకంలో నా పాత్రకూడా అదే—పెళ్లి కాని పిల్ల—సంక్షేమ కేంద్రంలో ఉద్యోగిగా వుండిపోతుంది—అనాధ బాలబాలికలకి చదువు నేర్పుతుంది. వాళ్లని తన సంతానంగా చూసుకుంటుంది.

కుటుం : ఏమిటో లక్ష్మి—అవన్నీ పుస్తకాలల్లో సినీమాలలో గాని, నిజంగా జరుగుతాయా నీవెర్రిగాని. స్వేచ్ఛగా వుంటె సంఘంలో వెలేస్తారు. ఎన్ని చూడ్డంలేదు' మనం.

లక్ష్మి : నిజంగా అల్లాజీవించాలన్న ఆదర్శం వుండడం మంచిదే కదా—కొత్త మార్గం తొక్కాలని వుంది నాన్నా. కొత్త మార్గంలో వెళ్లడం అంటే జనానికి భయంట. ముళ్లు, గతుకులూ వుంటాయని జంకుతారట. వాళ్లు వెళ్లలేరు సరికదా. వెళ్లే వాళ్లని చూసి నవ్వి. హేళన చేస్తారట—రామయోగి చెప్తూంటాడు.

కుటుం : అతని పాఠం నీకూ పట్టుబడింది. సెలవుల్లో చదువు చెప్పుకుంటానంటె సరే అన్నాను. ఈ పాఠాలా చెప్పడం రానీ అడుగుతా.

లక్ష్మి : అందులో తప్పేముంది నాన్నా.—ఊరికే పాఠం చెబుతాడాయన—ఎంత మంచి వాడో ! నువ్వు చెప్పింది మంచి

పద్ధతి అవుతే అసలు నేను స్కూలుకే వెళ్లక్కర్లేదు. కూపస్త మండూకం లా ఈ గది నాలుగ్గోడల మధ్యా వొంటిగా ఏడుస్తూ కూర్చోవాలి—సంబంధాలు రాకపోతే, రెడ్డెయ్యగారమ్మాయిని రెండో పెళ్లి వాణ్ణి కట్టారు పాపం—

కుటుం : ఎవడో వొకడు—అసలు పెళ్లంటూ అయితే ప్రతివాడు తల్లిలేని పిల్ల అని సంశయిస్తున్నారు—ఆ కొరత తీరుద్దామని.

లక్ష్మి : మళ్లీ పెళ్లా ?

కుటుం : ఏ పనిచేసినా మీకోసం అనుకో కాస్తో కూస్తో వున్న వాళ్లం - ఒకప్పుడు దర్జాగా. భాగ్యానికి పేరుపడి వున్నాం - ఆ పేరిట - కట్నాలు కూడా ఇవ్వడానికి సిద్ధంగా వున్నవాళ్లున్నారు. ఆ కట్నంతో నీ పెళ్లి. తిరుమలోడి చదువు, భూషిగాడి చదువు పూర్తవుతుందని - ఈ కాస్త త్యాగమూ చేసేద్దామని - మరి నీకు .... ఇష్టమేనా - ?

లక్ష్మి : నేనేం చెప్పను ఏమో - మరి - పెద్దన్నయ్యలు, అక్కలు వొప్పుకుంటే .... (కళ్లంట వొచ్చేనీరు ఆపుకుంటూ - మొహం చేతుల్లో దాచుకుని వెడుతుంది)

సీన : ఉత్తరాలు ఎయ్యిలేవుటండీ - వాళ్ల గురవడు యీ సీటి పట్టుకొచ్చాడండి అబ్బాయిగారి వూర్నుండి. (చీటి ఇస్తాడు)

కుటుం : (చదువుకుని) - చూశావా సీనయ్యా కోడలు ప్రసవించిందట. బిడ్డపుట్టిపోయిందట. — తల్లి క్షేమంగానే వుందిటలే — పోనీపాపం.

సీన : హరి భగవంతుడ - ఇంతకీ ప్రాప్తంలేదు. ఏంచేస్తాం మండి — పోనీ పాపం, కోడలుగారు బాగుంటే అదేశాన. అసలే ఆమెకు ఎయ్యోదోకులు, మూర్ఛలు, — పీలమనిషి.

కుటుం : తను భార్యాని తీసుకొస్తాడుట. లెక్క పంపమన్నాడు. లెక్క లెక్క — ఏమైంది ఆ గొలుసు ? ఏ మాత్రం వొచ్చింది ? (సీనయ్య జేబులో చెయ్యిపెట్టి తియ్యబోతాడు — తిరుమల గంతులేస్తూ. పాడుతూ. చప్పుడుచేస్తూ ప్రవేసిస్తాడు )

తిరుమల : నాన్నా — నాన్నా — పిల్లలంతా షికారెడుతున్నాం — పది రూపాయలియ్యి నాన్నా —

కుటుం : ఏం షికార్లురా — చదువులేదు చట్టబండలూ లేదు —

తిరు : పిల్లలందరం బస్సులో నాగార్జున సాగరం షికారెడుతున్నాం అన్నీ చూపిస్తారుట. రాతి బొమ్మలు తవ్వుతున్నారట. మేకలు గుర్రాలు. గుడి — భలే బొమ్మలే — అన్నీ మునిగిపోతాయిట నీళ్లలో — స్నానం చేసి ఈతకొడతాను. తాతయ్యా మేస్టరు తీసుకెడతాడుట.

తాతయ్యా తల పాతెయ్యి ఇల
పాతెయ్యి ఇల తాతయ్యా తల
(పాడతాడు)

కుటుం : నువ్వు కొంపలో క్షణం లేకుంటే — ఆ క్షణం స్వర్గం అనుకో.

తిరు : అదేమిటి సీనయ్యా — చేతిలోది, చొక్కాలో పెట్టేశావు ...

కుటుం : పోరా కొంపలోంచి.

తిరు : పదిరూపాయలియ్యి.

కుటుం : నువ్వుపోతే చాలు — పదేమిటి పాతికిచ్చుకుంటాను.

తిరు : పోతా నాగార్జున సాగరం మరిపోతా నేరుగా పోతా, మూతా, కూతా చేత, రాతా, - తాతయ్యా తల పాతెయ్యి ఇల (వెడతాడు)

కుటుం : చప్పన లెక్క తే సీనయ్యా చచ్చినాడా.

సీన : తీస్తుండానండి - ఆరు ఈరు వొస్తుంటురి ఎవ్వరికీ తెలవకూడ దంటిరి. (గొలుసు తీస్తాడు)

కుటుం : అదేమిట్రా గొలుసు గొలుసు పళంగా తెచ్చావు. ధర రాలేదా ?

సీన : ప్రమాదం జరిగింది సామీ - ఇదసలు బంగారం కాదంట. మోసం బంగారంట మిమ్మల్ని ఎవరో దగాచేశారు. పోతపోశారండీ -

కుటుం : ఏమిటీ మోసమా - బంగారందికాదూ ?

సీన : కాదంట పైపెచ్చు ఇది బంగారంది అని పైకంటే తంటా వొస్తుందండి. (నోరు నొక్కుకుంటాడు)

కుటుం : ఎంత మోసం జరిగిందిరా - వెనక అమ్మగారుండగా, లాకులుదాటించే పడవలవాళ్లకి. చేపలమైసెన్సు యిప్పించాను.

అ చచ్చినోళ్లు నలుగురూ కలిసి సొమ్మిచ్చుకోలేక ఈ గొలుసిచ్చారు అమ్మగారి మెళ్లోకి బాగుంటుందని సరే అన్నాను. భద్రంగా దాచింది. ఎప్పుడూ మెళ్లో వేసుకోలేదు - పరాయి సొమ్ము ఇష్టంలేక - భలే దగా చేశారు.

సీన : ఇది బంగారం అంటూ దుకాణంమీదికి తీసుకెళ్లినందుకు మనల్ని పట్టుకుంటారు పోలీసోళ్లు.

కుటుం : ఏకిశారు - ఎవ్రానీతో అన్నది.

సీన : దుకాణందారుడండి - అనంగానే వొణుకొచ్చి లగెత్తు కొచ్చానండి.

కుటుం : వాడేమన్నా రాయిమీద గీస్తెట్టాడా

సీన : ఏంగీట్లండి - ఆకొట్లో పరంధామయ్య కూడా ఉన్నాడు. అదిచెల్లదు తీసుకెళ్లరా - అన్నాడండి ఆయనకూడా.

కుటుం : ఆ - ఆ - పరంధామయ్యా మన పరంధామయ్యా ఆ .... (కళ్లు పెద్దవిచేసి మూర్ఛపోయినట్లుగా కుర్చీలో వొరిగిపోతాడు - తెరపడుతుంది). (సశేషం)

# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న : 155 సి. హెచ్. నాగభూషణమ్, చిన్నూరు, వయా మంచిర్యాల.

ఆదిలాబాదుజిల్లా చిన్నూరులో మార్కెట్‌ను యేర్పాటు చేయాలని ప్రభుత్వం నిర్ణయించినదా ? నిర్ణయిస్తే, యీ విషయంలో పని యెంతవరకు సాగినది ?

జవాబు : హైదరాబాదు వ్యవసాయ మార్కెట్ల చట్టంక్రింద చిన్నూరును చట్టబద్ధమైన మార్కెట్‌గా ప్రకటించాలనే ప్రతిపాదన ఒకటి ప్రభుత్వ పరిశీలనలో ఉన్నది.

ప్రశ్న : 156 సి. ఈశ్వరరెడ్డి, సుంకిడి, ఆదిలాబాదుజిల్లా.

ఆదిలాబాదులో ప్రభుత్వం నూలు మిల్లును యెప్పుడు ప్రారంభించగలదు ?

జవాబు : ఆదిలాబాదు జిల్లాలో నూలుమిల్లును నెలకొల్పాలనే సంకల్పం ప్రభుత్వానికి లేదు. నూలు వస్త్ర పరిశ్రమ పూర్తిగా ప్రైవేటు విభాగానికి వదలివేయ బడినది. ప్రస్తుతం 230132 మరకదుళ్లలో పనిచేసే 13 నూలుమిల్లులు వున్నవి. ఇవికాక రెండు కాంపోజిట్ వస్త్రాల మిల్లులు మొత్తం 10,136 కదుళ్లలోను, 1,208 మగ్గాలతోను పని చేస్తున్నవి. అలాగే మూడు నేతమిల్లులు మొత్తం 690 మగ్గాలతో పనిచేస్తున్నవి.

ఆదిలాబాదులో 12,000 కదుళ్లతో పనిచేసే నూలుమిల్లు స్థాపనకై లైసెన్సును కోరుతూ ఒక ప్రైవేటు సంస్థ దరఖాస్తు పెట్టినది. దానిని కేంద్రప్రభుత్వం పరిశీలిస్తున్నది.

ప్రశ్న : 157 ప్రామసరీనోట్లపై నయాపైసలలో చెల్లించవలసిన స్టాంపుడ్యూటీ రేట్లు ఏమిటో చెబుతారా ?

జవాబు : 1. సొమ్ము లేక విలువ రూ 250 లు మించినప్పుడు స్టాంపు డ్యూటీ : 0.10 న. పై.

2. సొమ్ము లేక విలువ రూ 250 లకుమించి రూ 1,000 లకు మించినప్పుడు స్టాంపు డ్యూటీ 0.15 న. పై.

3. తదితర సందర్భాలన్నిటిలో స్టాంపుడ్యూటీ 0.25 న. పై.

ప్రశ్న : 158 సి హెచ్. నాగభూషణం, చిన్నూరు.

1962 నుంచి అమ్మకం పన్నును రద్దుచేసి దానిస్థానే ఉత్పత్తిస్థలం వద్దనే పన్ను విధించుటకు ప్రభుత్వం నిర్ణయించినదంటున్నారు. ఇది యెంతవరకు నిజం ?

జవాబు : అటువంటి ప్రతిపాదన యేమీ లేదు.

ప్రశ్న : 159 జరుగుమల్లి సాంబశివరావు, షిల్లాంగ్.

తృతీయప్రణాళిక క్రింద ఆంధ్రప్రదేశ్‌లో నాలుగవ విశ్వవిద్యాలయం ఆరంభించే అవకాశమున్నదా ?

డెహరాడూన్‌లోని మిలిటరీ అకాడమీలోనూ, ఖడక్‌వల్స లోని నేషనల్ డిఫెన్సు అకాడమీలోనూ చేరదల్చుకొన్న పేద విద్యార్థులకు మన ప్రభుత్వ మేమైనా విద్యార్థి వేతనము లిస్తున్నదా ?

జవాబు : తృతీయ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్రప్రదేశ్‌లో మరొక (నాలుగవ) విశ్వవిద్యాలయాన్ని (నాగార్జున యూనివర్సిటీ) ప్రారంభించాలనే ప్రతిపాదన వున్నది.

డెహరాడూన్‌లోని రాష్ట్రీయ ఇండియన్ మిలిటరీ కాలేజ్‌లో చదివే ఆంధ్ర విద్యార్థులకు రాష్ట్రప్రభుత్వం యేటా దాదాపు రు 4,000 లు విలువగల విద్యార్థివేతనాలను యిస్తున్నది. ఈ విద్యార్థి వేతనాలకై దరఖాస్తులు, విద్యార్థులు కాలేజీలో చేరిన 15 రోజులలోగా ఆ కాలేజీ ప్రిన్సిపాలుద్వారా రాష్ట్రప్రభుత్వానికి సమర్పించ బడాలి.

పూనాలోని ఖడక్‌వల్స నేషనల్ డిఫెన్సు అకాడమీలో చదివే విద్యార్థులకు విద్యార్థి వేతనాలిచ్చే పథక మేమీలేదు.

# ప్రగతి పథంలో

(జిల్లాలనుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గూర్చిన సంక్షిప్త వార్తలు)

## ఆదిలాబాదు

### ప్రపంచ ఆరోగ్య దినోత్సవం

జిల్లాపరిషత్తు అధ్యక్షుడు శ్రీ పి. నరసారెడ్డి అధ్యక్షతన ఆదిలాబాదులో 7-4-61 న ప్రపంచ ఆరోగ్య దినోత్సవం జరిగినది.

### విద్యాగోష్ఠి

1961 ఏప్రిల్ 5, 6 తేదీలలో ఆదిలాబాదులో నిర్బంధ విద్యపై జిల్లాగోష్ఠి జరిగినది. జిల్లాలోని సాంఘికవిద్యా ఆర్గనైజర్లందరు, పాఠశాలల అందరు డిప్యూటీ ఇనస్పెక్టర్లు యీ సమావేశానికి హాజరైయారు.

### చిన్నమొత్తాల పొదుపు

1960—61 లో ఆదిలాబాదు జిల్లాలో చిన్న మొత్తాల పొదుపు క్రింద రు 7½ లక్షలు సేకరించ బడినవి.

## అనంతపురం

### పొదుపు ఉద్యమం

1961 మార్చి 26 న అనంతపురం లేడీస్‌క్లబ్ రు. 3000 లు, రెడ్‌క్రాస్ సొసైటీ రు. 1000 లు విలువగల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లను కొన్నవి.

అనంతపురంలోని క్రొత్త హెడ్‌క్వార్టర్సు హాస్పటల్‌ని 2-5-61 న శ్రీ ఎన్. సంజీవరెడ్డి ప్రారంభించారు. ఆస్పత్రి భవనం రు. 19 లక్షలతో నిర్మింప బడినది. దానిలో 250 పడకలు ఉన్నవి. రు. 2 లక్షలు విలువగల ఆధునిక సాధన సంపత్తి ఉన్నది. ఈ ఆస్పత్రిలో రు. 66 వేల ఖరీదుగల 300 ఎమ్. ఎ. ఎక్స్-రే ప్లాంటుకూడ ఉన్నది.

### కోడూరు మేలా

కోదండరామస్వామి ఉత్సవ సమయంలో కోడూరులో గోరంట్ల సమితి అధ్వర్యాన 27-3-61 నుంచి 29-3-61 వరకు మేలా ఏర్పాటుచేయబడినది.

## చిత్తూరు

### పంచాయతీ కార్యాలయం

16-4-61 న శాసనసభ సభ్యుడు శ్రీ ఆర్. నాదమునిరెడ్డిచే రేణిగుంట పంచాయతీ కార్యాలయం ప్రారంభింప బడినది. చాలమంది పౌరులు యీ వుత్సవంలో పాల్గొన్నారు.

## తూర్పు గోదావరిజిల్లా

### టెలిఫోన్ ఎక్చేంజి ప్రారంభం

ఏప్రిల్ 1న ఆలమూరులో ఒక ఆటోమేటిక్ టెలిఫోన్ ఎక్చేంజి ప్రారంభింపబడినది.

### బాలభటులు, గైడ్‌ల విన్యాసం

ఏప్రిల్ 8 న రాజమండ్రిలోని వీరేశలింగం హైస్కూలులో బాలభట, గైడ్ యూనిట్ల సమిష్టి విన్యాసం యేర్పాటు చేయబడినది. ఈ విన్యాసంలో, రాజమండ్రీ జిల్లా అసోసియేషన్ ఉపాధ్యక్షుడు శ్రీ పి. కామేశ్వరరావు చిరకాల సేవాపతకాన్ని (నేషనల్ అవార్డు) పొందారు.

## గుంటూరు

### పిల్లల బొమ్మలు

1961 మే మొదటి వారంలో గుంటూరు జనరల్ ఆస్పత్రి పేడియాట్రిక్ వార్డులోని పిల్లలకై లయన్సుక్లబ్ తరఫున కొన్ని బొమ్మలు బహూకరించ బడినవి.

### దుగ్గిరాల క్యాంపు

1961 ఏప్రిల్ ఆఖరివారంలో దుగ్గిరాలలో లోక్‌సహాయక

సేన శిక్షణ శిబిరం జరుపబడినది. శిక్షితులలో ఉత్తముడుగా నిర్ణయింపబడిన శ్రీ పి. జానకిరాంకి షీల్డు బహూకరించ బడినది.

*హరిజనదినం*

పంచాయతీ అధ్యక్షుడు శ్రీ ఎమ్. రామారావు అధ్యక్షతన ఏప్రిల్ 30 న తూళ్లూరులో హరిజన్ డే జరిగినది. ఉదయం వూరేగింపు జరిగినది. పిల్లలకు మిఠాయిలు పంచబడినవి.

*పూర్వవిస్తరణ కేంద్రాలు*

ఈ జిల్లాలో నాలుగు పూర్వవిస్తరణ కేంద్రాల ప్రారంభాన్ని ప్రభుత్వం మంజూరు చేసినది. వాటితో జిల్లాలో బ్లాక్‌ల సంఖ్య మొత్తం 27 కాగలదు. ఈ నాలుగుకేంద్రాలు సత్తెనపల్లి, మార్టూరు, కొల్లిపర, నరసరావుపేటలలో నెలకొల్పబడతవి.

*నేతపనివారి కాలనీ*

పేరాల చేనేత కార్మికుల సహకార ఉత్పత్తి అమ్మకం సంఘపు గృహావసతి కాలనీ యిటీవల ప్రారంభింప బడినది.

*ఎరుకలవారికి యిళ్ళు*

నరసరావుపేటలో ఏప్రిల్ 26 న "పంత్‌నగర్" ప్రారంభింపబడినది. ఈ కాలనీలో ఎరుకలవారికై 11 యిళ్లువున్నవి.

*పొదుపు ఉద్యమం*

గుంటూరు పట్టణంలో మార్చి 11-17 మధ్య నడిపిన ప్రత్యేక పొదుపు వుద్యమంలో రు. 1,54.900 లు సేకరించబడినవి. అదే కాలంలో ప్రైజ్‌బాండ్లకై రు. 6,685 సేకరించబడినవి. పట్టణంలోని ప్రముఖ స్త్రీలు ప్రైజ్‌బాండ్ల అమ్మకానికై తోడ్పడటం యీ ఉద్యమం విశేషాంశం.

*నిడుబ్రోలుకు రక్షిత నీటిసరఫరా*

నిడుబ్రోలు హరిజనవార్డులో రక్షిత మంచినీటి సరఫరా పథకాన్ని ఏప్రిల్ 13 న రాష్ట్ర పబ్లిక్‌వర్క్సు మంత్రి శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు ప్రారంభించారు.

*రమణాయపాలెం పంపింగ్ స్కీమ్*

రమణాయపాలెం పంపింగ్ పథకానికి 1961 ఏప్రిల్‌లో రాష్ట్ర పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు శంకుస్థాపన చేశారు. ఈ పథకానికి రు. 3,60,000 కాగలవని అంచనా. ఇందులో రు. 80,000 రైతులు ఇచ్చారు. ఈ పథకం క్రింద 3,600 యెకరాలు సాగుక్రిందకు రాగలవు.

## హైదరాబాదు

*రైతు యాత్ర : ప్రాజెక్టు ప్రాంతాలలో*

గుంటూరు, కృష్ణా, నెల్లూరు, కర్నూలు, జిల్లాలకు చెందిన రైతులు 400 మంది ప్రత్యేక రైలులో మే 7 న హైదరాబాదు వచ్చారు. వారు భారతదేశంలోని వివిధ ప్రాంతాల సందర్శనకై 7000 మైళ్ల దూరమును 63 రోజులలో ప్రయాణించనున్నారు. గుంటూరులో మే 5 న బయలుదేరిన వారు తొలి మజిలీగా యిక్కడ ఆగారు.

*స్త్రీల శిక్షణా శిబిరం*

1961 ఏప్రిల్‌లో కొంగ్రకలను గ్రామంలో స్త్రీల శిక్షణా శిబిరం యేర్పాటు చేయబడినది. మూడు గ్రామాలకు చెందిన 34 మంది స్త్రీలు యీ శిబిరంలో పాల్గొన్నారు.

*రంగుదారాల కుట్టు కేంద్రం*

మే 4 న నగరంలో కార్వాన్‌లో శిక్షణ-రంగు దారాల కుట్టు కేంద్రం ఒకటి తెరువబడినది. ఈ కేంద్రం, జంటనగరాలలో నిరుద్యోగ నివారణకు రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసిన పథకం క్రింద, పారిశ్రామిక సహకార సంఘాల సమాఖ్య అధ్వర్యాన యేర్పడినది.

## కరీంనగరం

*జిల్లా సమ్మేళనం*

ఏప్రిల్ 29, 30 లలో కరీంనగరంలో సమాజాభివృద్ధికై జిల్లా సమ్మేళనం జరిగినది. వికేంద్రీకరణ కార్యక్రమంలో పుత్పన్నమయే సమస్యల చర్చకై వుద్యోగులు, తదితరులు నాలుగువర్గాలుగా యేర్పడ్డారు.

## ఖమ్మం

*పూర్వ విస్తరణ కేంద్రం*

రాష్ట్ర దేవాదాయాలు, సహకార శాఖా మంత్రి శ్రీ కె. చంద్రమౌళి ఏప్రిల్ 29 న భద్రాచలం పూర్వవిస్తరణ కేంద్రాన్ని ప్రారంభించారు.

## కృష్ణా

*నాగార్జునసాగర్ పంపిణీ కాలువ*

నాగార్జునసాగర్ ప్రాజెక్టు కుడికాలువ సిస్టంలో భాగమైన

బండారపల్లి పెద్ద పంపిణీ కాలువపని, విజయవాడకు 28 మైళ్ల దూరానగల పేరుచెర్ల వద్ద మే 10 న ప్రారంభమైనది.

*ధాన్యం గిడ్డంగులు*

మిగులు ధాన్యం నిల్వకై బంటుమల్లి గ్రామీణ బ్యాంకు నిర్మించిన గిడ్డంగులను రాష్ట్రప్రణాళికలు, సమాచార శాఖా మంత్రి శ్రీ పి. రంగారెడ్డి ఏప్రిల్ 16 న ప్రారంభించారు.

*చెఱకుపంట పోటీలో అగ్రస్థానం*

ఏప్రిల్ 25, 26, 27 తేదీలలో విజయవాడలో జరిగిన అఖిలభారత చెఱకుపంట పోటీలో కృష్ణాజిల్లా మళ్లీ ప్రథమ శ్రేణి నాక్రమించినది. మామూలు యెకరాపంట దాదాపు 40 టన్నులుకాగా యిది అంచనా పంట 106.80 టన్నులను పండించినది. ఈ పోటీపొలం బొడ్డపాడు వాస్తవ్యుడు శ్రీ వై. వెంకటాచలానిది. చెఱకు రకం సి. డి. 419. ఇది దాదాపు 17 అడుగుల 6 అంగుళాల పొడవు పెరిగినది.

*పాఠశాలా భవనం*

మే 1న కలటూరులో ఒక ప్రాథమిక పాఠశాలా భవనం తెరువబడినది. ఇది రు 4,200 లలో నిర్మించబడినది. ఇందులో రు 2,100 లను గ్రామీణులు యిచ్చారు.

## కర్నూలు

*మార్కెట్ యార్డ్*

మే 7న కర్నూలుమార్కెట్ యార్డ్‌కి ముఖ్యమంత్రి శంకుస్థాపనచేశారు.

*ఉచిత నిర్బంధ విద్య*

2000 మంది పిల్లలకు పైగా వుచితనిర్బంధవిద్యకు వసతి కల్పించడానికి 1961 మే మొదటివారంలో కర్నూలు మునిసిపల్ కౌన్సిల్ ఒక పథకాన్ని ఆమోదించినది.

## మహబూబ్‌నగరం

*కొడంగల్ పాఠశాలకు బహుమతి*

కొడంగల్ ప్రభుత్వ వున్నతపాఠశాల జిల్లాలోకెల్లా ఉత్తమమైనదని జిల్లాపరిషత్తు అధ్యక్షుడు నిర్ణయించారు.

*స్థానికాభివృద్ధి పనులు*

1960–61 లో స్థానికాభివృద్ధి పనులక్రింద రు 1,50,000 ల ఖర్చుపై 9 పాఠశాలా భవనాలు, 12 బావులు చేపట్టబడినవి.

*గొఱ్ఱెలపెంపకం కేంద్రం*

ప్రత్యేక పరిస్థితులలో బళ్లారి, బికనీరు రకాలు యివ్వగల వుత్తమఫలితాల పరిశీలనకై మహబూబ్‌నగరంలో ఒక గొఱ్ఱెల పెంపకం కేంద్రాన్ని నెలకొల్పాలని ప్రభుత్వం నిర్ణయించినది.

## మెదక్

*చెండ్లపురానికి విద్యుచ్ఛక్తి*

సిద్దిపేట తాలూకా చెండ్లపురంలో విద్యుచ్ఛక్తి సరఫరాను 1961 ఏప్రిల్‌లో వ్యవసాయమంత్రి శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి ప్రారంభించారు.

*నిర్బంధ ప్రాథమికవిద్య*

1961 ఏప్రిల్‌లో సంగారెడ్డిలో నిర్బంధప్రాథమిక విద్యపై జిల్లాస్థాయిలో జరిగిన గోష్ఠిలో యీ కార్యక్రమం విజయానికి ప్రజాసహకారాన్ని సంపాదించే మార్గాలు చర్చించబడినవి.

*పొదుపు ఉద్యమం*

1960–61 లో చిన్న మొత్తాల పొదుపు వసూళ్ళలో ఆంధ్రప్రదేశ్‌లో మెదక్‌జిల్లా అగ్రస్థాన మలంకరించినది.

## నల్గొండ

*సూర్యాపేటకు వ్యవసాయ ఇంజనీరింగ్ యూనిటు*

సూర్యాపేటలో వ్యవసాయ ఇంజనీరింగు యూనిట్టును యేర్పాటుచేయవలెనని ప్రభుత్వం నిర్ణయించినది. సూర్యాపేటకు 3 బుల్‌డోజర్లు, 2 ట్రాక్టర్లు, 2 పవర్ డ్రిల్లర్లు మున్నగు పరికరాలు పంపబడినవి. ఈ యూనిట్టు అక్కడ త్వరలోనే పని ప్రారంభించగలదు.

*నీటిపారుదల పనులు*

ఒకానొక ఆయకట్టు క్రిందగల చిన్న నీటిపారుదల పనులను పంచాయతీ సంస్థలకు అప్పగించవలెనన్న ప్రభుత్వ నిర్ణయాన్ని అనుసరించి యింతవరకు జిల్లాపరిషత్తుకు 3136 చిన్న నీటిపారుదల వనరులు బదిలీ చేయబడినవి. క్రిందటియేడాది రెవిన్యూశాఖ రు 2.7 లక్షల ఖర్చుపై 468 చిన్న నీటిపారుదల పనులకు మరమ్మతులకు పూనుకొన్నది.

## నెల్లూరు

*తోటపల్లి గూడూరు సమితిలో సమాజాభివృద్ధి*

ఈనాడు సమితి గ్రామాలలో సహకారసంఘంక్రింద లేని

గ్రామమేలేదు. సమితిలో యిప్పుడు 69 ప్రాథమిక పాఠశాలలు పనిచేస్తున్నవి. కోడూరు సామాజిక కేంద్రానికయిన ఖర్చు రు 7,800 లలోను గ్రామస్థులు రు 6,300 లను ఇచ్చారు. రాష్ట్ర మొత్తంమీద విస్తృత పౌష్టికాహార కార్యక్రమం అమలుకై యెన్నబడిన నాలుగింటిలోను యీ సమితి ఒకటి.

## నిజామాబాదు

*"కుటుంబానికో ప్రణాళిక"*

"కుటుంబానికో ప్రణాళిక" పథకంక్రింద జరిగిన అభివృద్ధి సమీక్షకై 24-4-61 గాలిపురం గ్రామంలో జిల్లా ఉద్యోగుల సమావేశం జరిగినది.

## శ్రీకాకుళం

*ఉత్తమ గ్రామస్థాయీ కార్యకర్త*

1960–61 కి శ్రీకాకుళం జిల్లాలో ఉత్తమ గ్రామస్థాయి కార్యకర్తగా సీతంపేట ఏజన్సీ బ్లాకుకిచెందిన శ్రీ పి. ఎస్. హనుమంతరావు ఎన్నబడినాడు. ఉత్తమగ్రామ బహుమతి రు 250 అదే బ్లాకులోని పుణ్యాడ గ్రామానికి లభించినది.

*కొత్తసమితి*

జూన్ 1 నుంచి పార్వతీపురం బ్లాక్‌కి పంచాయతీ సమితి యేర్పాటు చేయబడుతుంది.

*ఉచితనిర్బంధ విద్య*

కురుపాంలో మే 1 న "సర్వవ్యాప్త వుచిత నిర్బంధ ప్రాథమికవిద్య"పై గోష్ఠి జరిగినది. కురుపాం నాన్‌సమితి రేంజి నుంచి ఉపాధ్యాయులు, ప్రధానోపాధ్యాయులు, అధ్యక్షులు, పంచాయతీసభ్యులు యీ గోష్ఠికి హాజరయారు.

## విశాఖపట్నం

*చేతిపనుల ప్రదర్శనం*

1961 ఏప్రిల్‌లో విశాఖపట్నంలో శ్రీమతి లలితాసచార్ స్త్రీల సాంఘిక సేవాసంస్థలు యేర్పాటుచేసిన చేతిపనుల ప్రదర్శనను ప్రారంభించారు.

*జనపనార, త్రాళ్ళఫ్యాక్టరీ*

మే 2 న విజయనగరంలో జనపనార, త్రాళ్ళఫ్యాక్టరీకి శంకుస్థాపన జరిగినది.

## వరంగల్లు

*వసతి గృహభవనాలకు శంకుస్థాపన*

ఏప్రిల్ 13 న రాష్ట్ర విద్యామంత్రి కాజీపేటలో ఫతీమా బాలికల బహుళార్థసాధక వున్నత పాఠశాల వసతిగృహం భవనాలకు శంకుస్థాపన చేశారు. ఈ భవన నిర్మాణానికి 2 లక్షలు కాగలవు.

## పశ్చిమ గోదావరి

*వార్షికోత్సవం*

ఏప్రిల్ 8, 9 జిల్లాపరిషత్తు వున్నతపాఠశాల వార్షికోత్సవం జరిగినది. ఆ సందర్భంలో కవిసమ్మేళనం, అష్టావధానం జరిగినవి.

*కాలువ వంతెన*

ఏప్రిల్ 17 న రాష్ట్ర పబ్లిక్‌వర్క్స్ శాఖామంత్రి శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు నరసాపురం–నిడదవోలు కాలువపై తూర్పు విప్పర్రువద్ద వంతెనకు శంకుస్థాపన చేశారు. దీనికి రు 2.5 లక్షలు ఖర్చు కాగలవు.

*సహకారసంఘపు కొత్తహాలు*

1961 మే మొదటివారంలో వీరవాసరం సత్యనారాయణ పెద్ద రకం సహకారసంఘం తాలూకు కొత్తహాలును సహకారసంఘాల రిజిష్ట్రారు ప్రారంభించారు.

*సర్వోదయ పురంలో సమాచార స్టాల్*

13 వ అఖిలభారత సర్వోదయ సమ్మేళనం సందర్భంలో 1961 ఏప్రిల్‌లో సర్వోదయపురంలో జరిగిన ఖాదీగ్రామోద్యోగ ఎగ్జిబిషన్‌లో రాష్ట్రసమాచారశాఖ యేర్పాటుచేసిన స్టాలు రమారమి 3 లక్షలమందిని ఆకర్షించినది.



# అల్లూరి సీతారామరాజు చరిత్ర

ఆంధ్రవీరుని అద్భుత జీవితము

అన్ని వివరాలతో

సచిత్రంగా వర్ణింపబడినది

(రచయిత: యర్రమిల్లి నరసింహారావు)

★

ఆర్టుపేపరుమీద మనోజ్ఞంగా ముద్రింపబడిన

## ప్రభుత్వ ప్రచురణము

వెల: రూ. 2-75 న. పై.

పోస్టేజి అదనం

ప్రతులకు: సమాచార పౌరసంబంధముల శాఖ

ఆంధ్రప్రదేశ ప్రభుత్వం,

హైదరాబాదు - 1



తుంగభద్ర ప్రాజెక్టు. ( 7 వ పుట చూడుడు. )



సింహాచల క్షేత్రము ( 45 వ పుట చూడుడు. )



అంబర్ చర్ఖా ప్రదర్శన 20-4-61 న ఉంగుటూరు సర్వోదయ నగర్‌లో జరిగినది.



అనంతపురం హెడ్‌క్వార్టర్సు హాస్పిటల్‌లోని నాలుగు ఆపరేషన్ థియేటర్లలోను ఒకటైన యిది 2-5-61 న తెరువబడినది.
ఈ ఆస్పత్రికి 2 లక్షల రూపాయల విలువగల ఆధునిక సాధనసంపత్తి సమకూర్చబడినది.



హైదరాబాదులో "రవీంద్ర భారతి" థియేటర్‌ను 11-5-61 న డా. ఎస్. రాధాకృష్ణన్ ప్రారంభించారు.



దీపాలంకృతమైన రవీంద్ర భారతి థియేటర్



రవీంద్రనాథ టాగూర్ నృత్యనాటిక " చిత్రాంగద " లో ఒక దృశ్యం : 11-5-61 న హైదరాబాదు రవీంద్ర భారతి థియేటర్‌లో ప్రదర్శించ బడినది.



12-5-61 న ప్రదర్శింప బడిన రవీంద్రనాథ టాగూర్ మరొక నాటిక " బసంత్ " లో ఒక దృశ్యం.



ఆంధ్ర ప్రదేశ్ నూతన ఆస్థానకవి శ్రీ కాశీ కృష్ణాచార్య.
(49 వ పుట చూడుడు.)



రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ డి. సంజీవయ్య 7-5-61 న హైదరాబాదు మల్లేపల్లి అఫ్జల్ సాగర్ మురికివాడ ప్రాంతంలో మురుగు కాల్వకు కాంక్రీటు వేస్తున్న దృశ్యం. అప్పుడు ఆయన నగరంలో 'మేయర్ క్యాంపు'ల పథకాన్ని ప్రారంభించారు.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈదిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు. కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}''$ డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావుపేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయే మొత్తమూ ప్రతినెల 8 వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరునటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేసిన డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను. డిమాండు డ్రాఫ్ట్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు-దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగుజాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన ఎంతస్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడుభాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్
సమాచార పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాద్—1

# శిలా విలాపము

పమిడికాల్వ చెంచునరసింహశర్మ

వేషాడంబర లోకవంచన మహావిద్యా ప్రయోగాఢ్యులై
యాపద్ధర్మ దయా స్వభావగతు లెప్డేలేని కుక్షింభరుల్
పాషాణాత్ములు; మేము గాదెటు దలంపన్ వారి స్వార్థక్రియా
పాషాణత్వము మాకుఁగల్గినటు లెవ్వారైన రూపింతురే ?

మానవ జాతికిన్ దురభిమానము లోభము వాయకున్న స
మ్మానముఁగీర్తి గల్గదని మందమతుల్ దెలియంగ లేక యెం
తే నిరసించి మమ్ముఁ గడుహీనతఁ గందురు వస్తుతత్త్వ వి
జ్ఞానులు సుప్రశస్త గుణసంపద మాయెడఁగాంతు రెంతయున్

లలితానర్ఘ విభాసితంబులగు సాలగ్రామ మాణిక్యముల్
గలిగెన్ మా కులమందు; వానిఁగొనుచున్ గామ్యార్థముల్ బొంది, యు
జ్వలులయ్యుం మముఁ గ్రూర నిర్దయకుఁ బోల్పం జూడగా బాడియే ?
కలకాలంబు వసించు శక్తిగద మా కాఠిన్య మంచెంచరే !

కోటలు పేటలుంగుడులు గోపురముల్ మొదలైన వెన్నియో
వాటముగా నమర్చుకొని వైభవముల్లసిలన్ వసింతు రే
పాటి స్వతంత్ర సౌఖ్యములఁ బాల్గొన నీయరదేమొ ! మమ్ము దోః
పాటవ మొప్పఁగొట్టి బహుభంగులఁదిట్టుదురే నరాధముల్.

రకరకమ్ముల వన్నెలఁగ్రాలు మమ్ము
నగలఁబొదిగించి తలమొదల్ నడుము దాక
జేర్చికొని కుల్కు చుండియు సిగ్గు లేక
వాగుచుందురు పాషాణ భావమూని.

నరుల యందుండు నీ కృతఘ్నత జగాన
నేపదార్థంబునకు రవంతేని లేదు
యిట్టి సంతానమున్ గూర్చి యెంత చింత
గ్రుగ్గుచున్నదో ? మావలె మాతృదేవి.

తాపసులవోలె ద్వంద్వ సంతతుల కోర్చి
యాత్మశక్తిని గోల్పోవ కనవరతము
విశ్వకల్యాణ భావ భావితులమైన
మాకు నీడౌదురే ? యల్ప మానవాళి.

ప్రాణులకు వోలె నిద్రాద్యవస్థ లుండు
వివిధ రూపంబులును, లింగ భేదములును,
గాన నైపుణియున్, మాకుఁగల వటంచుఁ
దెలిసి యుండిన మమ్మిట్లు దెగడరెపుడు.

ఉత్తములు సద్గుణ ఖ్యాతి నొందు భాతిఁ
గంట మమరావతీ శిల్ప కళల మురువు
సృష్టి తత్వజ్ఞునందు ధీవృత్తి వోలెఁ
దాజమహాలున మావెల్గు తాండవించు.

జగముల్ గ్రుంగవె ? మేము లేని యెడ నాచంద్రాది గోళంబులున్
దగినట్లుండునె ? దైవభావమున నానారూప భోక్తృత్వముల్
మిగులన్ గాంచుచు మాకు నెల్లరును 'స్వామీ ! మమ్ముఁగాపాడు' మం
చుఁ గరమ్ముల్ ముకుళింపఁ బెంపుగను మాసుద్దుల్ వినింద్యమ్ములే?.

తెలుఁగు జోదుల విజయ గాథలను విన్న
మురిసి పోదుము మేనెల్లఁ బులకరింప
స్వార్థపరుల బడాయి వేసాలఁగన్నఁ
గ్రాగిపోదుము ఖేదంబుకరుడు గట్ట.



# శ్రీ సింహాచల క్షేత్రము

మండా సూర్యనారాయణ

విశ్వ ప్రజలకు ఆధ్యాత్మిక సంపదను అందించినదే భారత దేశం. మహర్షులకు పుట్టినిల్లు మన భారత వర్షం. ప్రపంచంలో ప్రసిద్ధ వేదాంత గ్రంథాలయిన వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు యిక్కడే ఉద్భవించేయి.

మన చరిత్రలు, మన కథలు, మన ఆచార ధర్మాలు, అన్నిటా భగవంతుని పైగల భక్తి ఆత్మార్పణం ప్రకటించేవిగనే వుంటాయి.

మన పాటా, ఆటా, శిల్పం, చిత్రలేఖనం మన కళలన్నీ భగవదారాధన కోసమే వినియోగిస్తూ వచ్చేరు. పూర్వుల నుండీ నేటివరకూ, హిందూదేశంలో వున్న దేవాలయాలు, పూజావిధులు ప్రపంచమందింకెక్కడా కానరావు.

దేవళం అత్యంత పూజనీయమైన స్థలం. కలిమీ లేమీ, కులమూ, బలమూ, భేదంలేక సర్వులూకలసి పూజచేసుకొనే భగవంతుని మందిరం, దేవాలయం.

కాశీవిశ్వేశ్వరాలయం, బదరీనారాయణ నిలయం, కంచి కామాక్షి గుడి, మధురమీనాక్షి దేవాలయం, తంజాపూరు బృహదీశ్వరాలయం, శ్రీరంగం, రామేశ్వరం, తిరుపతి, కాళహస్తి, సింహాచలం మున్నగు దేవాలయాలు భారత ప్రజల భక్తి తత్వాన్ని చాటుతున్నాయి. యీ దేవాలయాలన్నీ ప్రకృతికి ఆలవాలమైన అతిసుందర వాతావరణంలో నెలకొల్పబడ్డాయి.

తెలుగు దేశంలోనే ఎన్నో దేవాలయాలు ప్రాచీనకాలం నుంచీ వెలసివున్నాయి.

శ్రీ తిరుపతి వెంకటేశ్వరస్వామి, శ్రీశైల మల్లిఖార్జున స్వామి, శ్రీదాక్షారామ భీమేశ్వరస్వామి, శ్రీ భద్రాద్రి రామన్న, శ్రీ సింహాద్రి అప్పన్న, శ్రీ అహోబల నారసింహస్వామి, శ్రీ లేపాక్షి బసవన్న, శ్రీ తెలంగాణా కాళేశ్వరస్వామి, శ్రీ అన్నవరం సత్యనారాయణ స్వామి, శ్రీ అరసవిల్లి సూర్యనారాయణ స్వామి, శ్రీ ముఖలింగ సోమేశ్వర స్వామి, శ్రీ కూర్మ స్వామి మున్నగు వేల్పులు తెలుగు దేశమందంతటా వివిధ క్షేత్రాలలో వెలసివున్నారు.

తెలుగువారి హృదయాలను విశేషంగా ఆక్రమించుకొన్న వారిలో తిరుపతివెంకన్నా, భద్రాద్రి రామన్న, సింహాద్రి అప్పన్నా ప్రథమంగా చెప్పవలసినవారు.

ఆంధ్రుల కుటుంబాలలో యీ వేల్పుల పేర్లు పెట్టుకోడం ఆచారం అయింది. ప్రతి తెలుగు యింటా ఏదో ఒక పేరు వినిపిస్తుంది. వెంకటేశ్వర్లు, వెంకట్రావు, వెంకన్న, వెంకటశాస్త్రి, తిరుపతి, వెంకటమ్మ, వెంకటరమణమ్మ, వెంకటలక్ష్మి మున్నగునవి మార్పు చేర్పులతో ఏదోలా పేరు పెట్టుకుంటారు.

రాముడు సరేసరి. రామం, రామారావు, రామశాస్త్రి, సీతారాముడు, రామన్న, రామమ్మ, సీతారామమ్మ, రామలక్ష్మి,మున్నగునవి. అట్లాగే సింహాద్రి అప్పన్న, అప్పలనరసింహం, అప్పన్నశాస్త్రి, అప్పన్న, నరసన్న, నరసయ్య, నరసింహులు, సింహాచలం, సింహాద్రి, సింహాద్రయ్య, అప్పల నరసమ్మ, అప్పలమ్మ, నరసమాంబ, పేర్లు పెట్టుకుంటారు. ఇవన్నీ తెనుగు జనులకు ఆయా దేవుళ్ళపై నుండే భక్తి ప్రపత్తులకు సాక్ష్యమేకదా!

ఈ క్షేత్రాలలో ఒకటయిన శ్రీ సింహచలక్షేత్రంలో వెలసిన శ్రీ వరాహలక్ష్మి నృసింహస్వామి మాహాత్మ్యాన్నీ, యాత్రా విశేషాల్నీ చరిత్రనూ సంగ్రహంగా ముచ్చటించుకుందాము.

శ్రీ సింహచల క్షేత్రం కళింగ దేశంలోవుంది. భారత చరిత్రలో కళింగదేశం చాల ప్రాముఖ్యత కలది, కాళిదాస కవీంద్రులు, పాణిని, మెగస్తనీసు, మున్నగు వారు కళింగదేశ వైభవాన్ని కీర్తించేరు. ఆశోకునినాడు కళింగరాజుల బాహుబల దర్పాలు, పౌరుషాలు విశదమయే వున్నాయి. ఆనాటి కళింగ సీమలో వెలసియున్న మహాక్షేత్రమే శ్రీ సింహాచలం.

ఉత్తరాంధ్రలోని కళింగ సీమనే తూర్పుదేశమని వాకొంటారు. విశాఖ, శ్రీకాకుళం, గంజాం మండలాల సర్వ జనులూ సింహాద్రి

నారసింహుని మిక్కిలి భక్తితో కొలుస్తారు. ఆపదలలో మ్రొక్కులు మ్రొక్కుకుని కొండకు వచ్చి దేవుని దర్శనం చేసుకొని వెళ్తారు. తూర్పువారి కున్న మూఢ నిర్మలభక్తి అపరిమితం.

శ్రీ సింహాచలక్షేత్రం విశాఖ పట్నానికి పదిమైళ్ళ దూరంలో వెలసిన పెద్ద కొండపైనుంది. మనోహరమైన వాతావరణంలో వెలసిన శ్రీ వరాహ లక్ష్మీనరసింహస్వామి వారి మాహాత్మ్యాన్ని మనవి చేస్తాను.

శ్రీ సింహాచల పుణ్యక్షేత్ర మాహాత్మ్యం వేదవ్యాస భట్టారకునిచే రచింపబడి, జైమిని మహర్షిచే చెప్పబడిన స్కాంద పురాణంలో వివరించబడివుంది.

యుగాలకు వెనుక కృతయుగంలో రాక్షస రాజగు హిరణ్యకశిపుడున్నట్లు మనమెరిగిన సంగతే. అతని పుత్రుడు ప్రహ్లాదుడు తండ్రిచే సముద్రంలో త్రోసివేయ బడినపుడు శ్రీ విష్ణుదేవుడు తన భక్తుడగు ప్రహ్లాదుని రక్షిస్తాడు విష్ణువు యీ కొండపై కురికి సముద్రంలో పడిన ప్రహ్లాదుని రక్షించి, అహోబలానికి పంపించివేసేడు.

మరునాడు అహోబలానికి వెళ్ళి హిరణ్యకశిపుని చీల్చి చంపేడు. ప్రహ్లాదునికి పట్టాభిషేకం చేసి రాజ్యం అప్పగించి యిలాపల్కేడట:

"నీ పినతండ్రిని చంపిన వరాహ రూపంతోను, నీ తండ్రిని చంపిన నారసింహుని రూపంతోను, కూడిన వరాహ నారసింహ మూర్తిగా సింహాద్రిపై నీకు దర్శన మిస్తాను. దర్శించి మోక్షం పొందు" అని అంతర్ధాన మయ్యెను విష్ణుదేవుడు.

ప్రహ్లాదుడు బహుకాలం రాజ్యసుఖాలు అనుభవించి పిదప మనుమనికి రాజ్యం అప్పగించి సింహాచలానికి విచ్చేసి శ్రీహరిని ప్రార్థింపగా విష్ణువు సాక్షాత్కరించెను. ఆ మూర్తిని అర్చించి ఒక విచిత్రమగు విమానంలో ప్రతిష్ఠించేడు ప్రహ్లాదుడు. అనంతరం ఒక పట్టణాన్ని నిర్మించెను. నాటినుండి సింహాద్రి పుణ్యక్షేత్రరాజమైంది. ఈ క్షేత్రానికి బ్రహ్మదేవుడు వచ్చి లక్ష్మీసమేతుడగు నరసింహుని దర్శించి పూజించేడు.

ప్రహ్లాదుని అనంతరం యీ క్షేత్రం అరణ్యంగా మారింది. కొంతకాలం తర్వాత పురూరవ చక్రవర్తి పుట్టలో మరుగుపడిన స్వామిని తెలుసుకొని పుట్టను త్రవ్వించి స్వామివారిని దర్శించి పూజించేను. ఆ రోజు వైశాఖ శుక్ల తదియ. అందుచేతే నేటికీ నిజ స్వరూపాన్ని వైశాఖ శుద్ధ తదియనాడు దర్శిస్తారు. ఇదీ క్షేత్రమహాత్మ్యం.

ఈ విధంగా యుగాలనుండి సింహాద్రి నారసింహుడు పూజింపబడుతూ భక్తుల కోరికలు ఫలింపజేస్తూ మోక్షము ప్రసాదిస్తున్నాడు.

సింహాద్రి నాథుని మహాత్మ్యాన్ని తెలుసుకొని సామాన్య ప్రజలు, రాజులు, రారాజులు సర్వులు సింహాచలమునకు వచ్చి నారసింహుని అర్థిస్తూనేవున్నారు వేలేండ్లనుండి.

11వ శతాబ్దంలోని కులోత్తుంగ చోళచక్రవర్తి, 12వ శతాబ్దిలో రాజమండ్రి రెడ్డిరాజులు, యింకా: వడ్డాది, పంచదార్ల, కటకం రాజులు, లక్ష్మీనరసింహుని పూజచేసి భగవంతుని కైంకర్యం కోసం భూ ధనాదులను సమర్పించారు.

16వ శతాబ్దంలో కృష్ణదేవరాయలు నరసింహదేవుని దర్శనం చేసుకొని కానుకలిచ్చి భగవంతుని భోగాలకు కొన్ని గ్రామాలు రాసిచ్చేడు, విజయనగర పూసపాటి రాజులు సింహాచల స్వామి ముఖ్యారాధకులైనారు. సింహాచల దేవస్థానం విజయనగర రాజుల ఆధీనంలో వుంచుకొని భద్రంగా నిర్వహిస్తున్నారు.

యీ నరసింహ స్వామిని గూర్చి కొన్ని చారిత్రక గాథలున్నాయి. సుమారు రెండువంద లేండ్ల క్రితం పిండారీలు సింహాచల ప్రాంతంపై దాడివెడలేరు. తురకలు దేవాలయ విగ్రహాలు కొట్టి ధనం దోచు కుంటున్నారు. అప్పటికప్పుడే కల్యాణమండపంలోని కొన్ని భాగాలు పాడుచేసేరు దండు. — ఆకాలంలో గోగులపాట కూర్మనాథకవి అనే భక్తుడుండేవాడు, ఆ కవీశ్వరుడు తురకల దుండగాన్ని భరించలేక 'శ్రీ సింహాద్రి నారసింహ శతకము' పేర దేవుని స్తోత్రం చేసేడు. గర్భగుడిలో ప్రవేశిస్తున్న పిండారీ దండుపై కంచుతుమ్మెదలుపడి తరుమసాగేయి. భగవంతుని స్తోత్ర ఫలితమేయిది. ఆ కంచుతుమ్మెదలు విశాఖపట్నంవరకూ పిండారీ దండుని తరిమి అదృశ్యం అయేయి. ఆ ప్రాంతాన్ని తుమ్మెదలమెట్ట అని యిప్పటికీ అంటారు. శతకంలో యీ విశేషాలన్నీవున్నాయి.

వైష్ణవ మతస్థాపకుడగు శ్రీ రామానుజాచార్యులవారు (11వ శతాబ్దం) సింహాచల క్షేత్రానికి విచ్చేసినట్లు గాథలున్నాయి.

యాత్రికులగు భక్తులు స్వామిని దర్శించడం గురించి కొన్ని వివరాలు తెలుసుకోవలసివుంది.

కొండ దిగువ 'వరాహ పుష్కరిణి'లో భక్తులు ముందుగ

స్నానంచేసి అక్కడనున్న భైరవ స్వామిని పూజించి కొండ ఎక్కడం ప్రారంభిస్తారు. మార్గంలోని దార్లలో స్నానంచేస్తూ ఆంజనేయుని దర్శించి గంగ ధార వద్దకు వెళ్తారు. గంగ ధార చాల ముఖ్యమైంది. దీనినే పుట్టుధార అనికూడ అంటారు. యాత్రికులు గంగధారలో స్నానంచేసి పుట్టుజుత్తుల మొక్కులున్న వారు ఆ మొక్కులు తీర్చుకొని క్షేత్రపాలకుడైన విశ్వేశ్వరుని దర్శిస్తారు.

అనంతరం దేవాలయంలోకి వెళ్తారు. స్వామిని పూజించి, లక్ష్మీదేవిని, ఆండాల్‌వారిని దర్శించుకుంటారు. దేవళంలోనే 'కప్ప స్తంభం' వుంటుంది. సంతానం కోరేవారు కప్ప స్తంభానికి పూజచేసి ఆలింగనం చేసుకుంటారు. కొందరు పశువుల్ని సమర్పించుకుంటారు.

స్వామి ఎల్లపుడూ చందనంపూయబడే వుంటాడు. చందన యాత్రనాడు మాత్రమే నారసింహుని నిజస్వరూప దర్శనం లభిస్తుంది. మిగిలిన సంవత్సరమంతా లింగాకృతిలోనే దైవ స్వరూపం కాననస్తుంది.

దేవుని ఉత్సవాలలో ముఖ్యమైనవి, కల్యాణోత్సవం, చందన యాత్రా, కల్యాణోత్సవం చైత్ర శుద్ధ ఏకాదశి నుండి పూర్ణిమ వరకూ జరుగుతుంది. చందనయాత్ర నారసింహుని నిజస్వరూప దర్శనం: వైశాఖ శుద్ధ తదియనాడు జరుగుతుంది. యింకా సంవత్సరం పొడవునా ఉత్సవాలు జరుగుతూ వుంటాయి.

ఈ క్షేత్ర రామణీయకత అద్భుతమైంది. వాతావరణం మిక్కిలి ఆహ్లాదకరమైనది. 'గంగాధారలు' ఫలపుష్పవనాలు, ఓషధులు, పక్షుల మధురధ్వనులు, ప్రశాంత మందమారుతాలు, యాత్రికులను దివ్యానుభూతులతో తన్మయులను చేస్తాయి.

సింహాచలంమీది ధారలు ఔషధములతో కూడి యుంటా యనీ ఆ ధారలలో స్నానం చేసిన వారికి రోగాలుండవనీ పెద్దలు భావిస్తారు.

యాత్రికులు సింహాచలాన ముఖ్యంగా చూడవలసినవి దేవాలయంలోని శిల్పం, కల్యాణ మంటపం, రాతిరథం, అద్దాల మండపం, మొదలైనవి.

తెలుగువారు, ఉత్కళదేశీయులు, ఇంకా ఉత్తరాదివారూ సింహాచలంవచ్చి నరసింహస్వామి దర్శనం చేసుకుని వెళ్తాంటారు. శ్రీ వరాహ లక్ష్మీనృసింహస్వామి భక్తవరదుడు, అభీష్ట ప్రదాత, ఆబాలగోపాలం భక్తులెల్లరూ సింహాచల యాత్రచేసిన ఇహపర సుఖాలు పొందగలరు.

సింహాద్రి నాథుని దర్శిస్తే ఆ దేవుని మహిమ సర్వులకూ తెలుస్తుంది.

## పెద్దవూర బ్లాక్‌లో శిలాస్ఫటికాలు

నల్గొండజిల్లా పెద్దవూరబ్లాక్ పంచాయతీసమితి గ్రామం ఎర్రబల్లిలో దొరికిన శిలాస్ఫటికాలను పరీక్షించి చూడగా గాజు పింగాణీ పరిశ్రమలకు వుపయోగపడు యిసుక రాయి. 99.6 శాతం ఉన్నట్టు తేలినది. పై పరీక్ష పెద్దవూర పంచాయతీ సమితి కోరికపై హైదరాబాదులోని ప్రాంతీయ పరిశోధన లేబొరేటరీలో జరుపబడినది. ఈ శిలా స్ఫటికాలు దాదాపు అర చదరపుమైలు ప్రదేశంలో గల రాళ్ళలో పుష్కలంగా వున్నవి. స్థానికంగా సేకరించిన కొన్ని స్ఫటికాలలో పారదర్శకమై మెరుస్తూవుండే "ప్రిజమ్సు" వున్నవి. బ్లాకు ప్రాంతంలో గాజు, పింగాణీ ఫ్యాక్టరీలను నెలకొల్పమని పంచాయతీ కోరినది. 

# రోడ్డు రవాణా సౌకర్యాలు

కె. ఆర్. కె. ప్రసాద్

ఆంధ్రప్రదేశ్ రోడ్డు ట్రాన్స్పోర్టు కార్పరేషను వారికి ఏప్రిల్ నెల పండుగ నెల అని చెప్పాలి. అఖిల భారత స్థాయిలో సమావేశాలు జరగటం, అవైనా ఆర్. టి. సి. — రోడ్డు రవాణా సంస్థ — వారి బస్సులు నడిచే కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలో జరగటం చెప్పుకోతగ్గ విశేషం — అనాలి. ఆంధ్ర ప్రాంతంలో మరెక్కడైనా ఈ సమావేశాలు జరిగుంటే, ఇన్నివేల ప్రజాసేవకులకు సేవచేసే భాగ్యం ఆర్. టి. సి. కి లభించేది కాదు.

అఖిలభారత కమ్యూనిస్టుల సమావేశం జరిగిన బొంబాయి నగరానికేమి, అఖిలభారత సర్వోదయ సమావేశం జరిగిన ఉంగుటూరు ప్రాంతంలోని సర్వోదయపురం ప్రాంతాలకేమి ఆంధ్రప్రదేశ్ యువజన కాంగ్రెస్ సమావేశ నిలయమైన పండిట్ పంత్ నగరానికేమి జనం తండోపతండాలుగా వచ్చారు. విజయవాడ వేసంగి విడిదికాదు. కాని ప్రజలు మాత్రం తమ అభిమాన నాయకుల ఉపన్యాసాలు వినేందుకు వేలకొలది గుమి గూడారు యీ మూడు నగరాలలో.

ఆంధ్రప్రదేశ్లో జాతీయం చేయబడిన రోడ్డు మార్గాలను ఆంధ్రప్రదేశ్ రోడ్డు ట్రాన్స్పోర్టు కార్పరేషను అనే సంస్థ నడుపుతూంది. ఇప్పటికి తెలంగాణా ప్రాంతాలలోగల తొమ్మిది జిల్లాలలో కాక ఆంధ్రలో కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలో రోడ్డు మార్గాలు జాతీయం చేయబడ్డాయి. 1308 బస్సులకు సొంతదారైన ఈ ఆర్. టి. సి. సంస్థ ఇలాంటి సమావేశాలకు ఏర్పాట్లు చేయడంలో అందెవేసిన చేయి. ఏటేటా భద్రాచలంలో శ్రీరామ నవమీ సమయంలోనూ, శ్రీశైలంలో మహాశివరాత్రికీ, మరెన్నో ఉత్సవాలకూ ఊరేగింపులకూ ప్రయాణీకుల సౌకర్యాలకై తగిన ఏర్పాట్లు గత 28 సంవత్సరాలగా చేస్తున్న సంస్థ ఇది. తృతీయ పంచవర్ష ప్రణాళికాంతం నాటికి యావదాంధ్ర ప్రదేశంతటా ఆర్. టి. సి. బస్సులు తప్ప మరే బస్సులు వుండవు. ఆనాటికి 2000 లకు పైగా బస్సులను నడుపుతూ సుమారు 20,000 మందికి జీవనోపాధి కల్గించేసంస్థ అనే గౌరవం దక్కుతుంది ఆర్.టి.సి. కి.

రోజూ కొన్నివందల మార్గాలలో కొన్ని వేల బస్సులు నడుపుతూ లక్షలకొలది ప్రయాణీకులకు రాకపోకల వసతులు కలుగచేయడం ఒక ఎత్తైతే, రెండు మూడురోజులలో ఒక నిర్ణీత స్థలానికి ఎన్నో వేలమంది ప్రయాణీకులను చేరవేసి మరోరెండు రోజుల తర్వాత వారిని తిరిగి వారివారి గమ్యస్థానాలకు చేర్చడం మరింత గురుతరమైన బాధ్యతలు గల పని. అంత నేర్పుతో ఇలాంటి కార్యభారాన్ని నిర్వహించి కృతకృత్యు లయ్యారు విజయవాడ, ప. గోదావరికి చెందిన ఆర్. టి. సి. బస్సు పనివారు.

సాధారణంగా ప్రయాణీకుల సంఖ్యకు తగినన్ని బస్సులను నడిపే ఈ సంస్థ ఒక్కసారిగా ఇన్ని బస్సులను ఇలా ఉపయోగించడం ఎలా సాధ్య మవుతుందా అన్నప్రశ్న రావటం సహజమే. అత్యవసర ఏర్పాట్లు ఎన్నిచేసినా నిర్ణీతమైన మార్గాల రాకపోకలకు ఏమాత్రం భంగం కలగకుండా చూడటమే ఇందులో ప్రత్యేకత. ఇది ఎలా సాధ్యమో చూడండి.

ఒక ప్రాంతంలోకల బస్సుల రాకపోకలను నిర్వహించే ఆర్. టి. సి. అధికారిని డివిజనల్ కంట్రోలర్ అంటారు. తన ఆధీనంలో వున్న ప్రాంతాలలో జరుగగల సమావేశాలు అందుకై వినియోగించే బస్సుల విషయమూ ఆ అధికారికి వార్తలందగనే అందుకై ప్రయత్నాలు చేయడం మొదలు పెడతారు. ఒక్కొక్కసారి సమావేశాలను ఏర్పాటు చేసిన కార్య నిర్వాహకవర్గం వారే ముందుగా యీ విషయాలను తెలియచేయటం కద్దు. కాని ఇలాంటి అభ్యర్థనల నిమిత్తం లేకుండా మామూలుగా ఆర్. టి. సి. అధికారులు తమ ప్రయత్నాలు చేయటం జరుగుతుంది.

ఒక సమావేశానికిగాని, ఒక ఉత్సవానికిగాని మరే ప్రత్యేక పరిస్థితులలో గాని అదనంగా కొన్ని ప్రత్యేక ఏర్పాట్లు చేయాల్సి వుంటుందన్న విషయం రూఢి కాగానే, డివిజనల్ కంట్రోలర్ వేసుకున్న అంచనాల ప్రకారం తనకు కొన్ని బస్సులు అదనంగా

అవసరమవుతాయని, తక్కిన డివిజనల్ కంట్రోలర్లకు, హెడ్ ఆఫీసుకు తెలుపుతారు. వెంటనే తగు మాత్రం రిపేర్లతో బాగు చేయగల బస్సులన్నింటినీ రెండు మూడు రోజులలో మరింత చురుకుగా పనిచేసి తయారు చేస్తారు. ఆపైన అందుకు కావలసిన టెంపరరీ పర్మిట్టులు తయారుచేసి వుంచుతారు. సెలపైవున్న కండక్టర్లనూ, డ్రైవర్లనూ డ్యూటీలో చేర్పించటమే గాక, కూలి పద్ధతిని కొంత మందిని తాత్కాలికంగా నియమించడం జరుగుతుంది. ప్రయాణీకుల వసతికిగాను తాత్కాలికంగా బస్సుడిపోలను నిర్మించడం, వలసినందరిని మెకానికులను ఆ ప్రాంతాల్లో వుంచి, చిన్నచిన్న రిపేర్లవల్ల బస్సులు ఆగిపోవడం జరగకుండా చూడడం లాంటి గట్టి ఏర్పాట్లు చేయబడుతాయి.

ప్రత్యేకమైన సమావేశంగాని మేలాగాని జరిగితే దేశంలో నలు మూలలనుంచీ ప్రజలు, నిర్ణీత కాలానికి ఆ ప్రాంతాలు చేరుకుంటారు. ఆ సమయంలో అందరూ అటువైపే ప్రయాణం చేస్తుంటారు. అందుకని ఆయా మార్గాలలో ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్లు ప్రత్యేకంగా ఇందుకోసం నియమించ బడతాడు. ఈ టి. ఇ.లు ప్రత్యేకంగా ప్రయాణీకులకు కావలసిన వసతులు ఏర్పాటు చేస్తారు. ఒక్కొక్క సారి, దూర ప్రయాణీకుల సౌకర్యంకోసం బస్సుల ఛార్జీలు తగ్గించడమే గాక, రిటర్న్ టికెట్లు పై మరికొంత రుసుమివ్వడం జరుగుతుంది. ఇటీవల శ్రీశైలం, భద్రాచల యాత్రీకులకై ఇలాంటి వసతు లేర్పరచ బడ్డాయి.

ఈ విధంగా నలుమూలలనుండీ ప్రజావాహిని అనుకొన్న రోజుకు గమ్యస్థానంచేరి, ఒక మానవ మహా సముద్రంగా కనులపండువుగా తయారవుతుంది. అంత వరకు బాగానేవుంది కాని సమావేశమో, మేలానో ముగియగానే, ఒక్కసారిగా కొన్ని వేలమంది ఇళ్ళకు చేరాలనుకుంటారు. బహుశా 5,6 గంటలలో కొన్ని వేలమంది ప్రయాణీకులను, సమీపంలోవున్న ముఖ్య పట్టణాలకు, రైల్వే స్టేషన్లకు చేర్చడం జరుగుతుంది. ఈ కొద్ది కాలంలో ఆర్. టి. సి. లో రద్దీలో కొన్ని సౌకర్యాలు లభించక పోవచ్చు. కాని అందరికీ ప్రయాణ వసతులు కల్పించటమే ముఖ్యోద్దేశం కావటంచేత చిన్న చిన్న లోపాలు అంతగా లెక్కకు తీసుకొనిరావడం భావ్యంకాదు.

ఇలాంటి ప్రత్యేకమైన ఏర్పాట్లు చేసినపుడు లాభాలేమాత్రం వచ్చాయన్న సమస్య రాదు. ప్రజా సౌకర్యమే ముఖ్యోద్దేశం. అయితే ఇంతటి గురతర బాధ్యతలను నిర్వహించి ఎంతో చాకచక్యంతో నిర్వహింప గల్గుతున్నామన్న తృప్తి ఆర్. టి. సి. వారికెంతో శక్తినిస్తుందనటంలో అతిశయోక్తి లేదు. అందుచే వారు మరింత ఉత్సాహంతో ఇంతకన్నా గొప్ప ప్రయత్నాలు చేస్తూ ముందంజ వేయ గల్గుతున్నారు.

ఇందులో చెప్పుకోదగ్గ విషయం ఏటేట జరుగుతున్న ఈ ఏర్పాట్లు సక్రమంగా జరగటమేగాక, ప్రమాదాలు ఏమాత్రం సంభవించకపోవడం. ఇందులకు ముఖ్యంగా జిల్లా పోలీసు అధికారులు, కలెక్టరులూ ఎంతో తోడ్పడుతారు.

ఈ పనులన్ని సక్రమంగా జరగడం గొప్ప యాగం చేసినంతపనే అయినా ఆర్. టి. సి. వారి బాధ్యత లంతటితో తీరవు. తాము చేసిన ఏర్పాట్లను ఒక్కొక్కసారి సింహావలోకనం చేసుకొని, ప్రజలు, పత్రికలు చేసిన ప్రశంసలను విమర్శలను లెక్కగట్టి, మరోసారి పొరపాట్లు జరుగనీయకుండా ఉండేట్లు చూసుకుంటారు.



## ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి

వయోవృద్ధులైన శ్రీ కాశీ కృష్ణాచార్యుల గారిని రాష్ట్ర ఆస్థాన కవిగా నియమించుటకు ప్రభుత్వం చేసిన నిర్ణయంతో సర్వత్రా హర్షామోదాలు వెల్లివిరిసినవి. ఇందుకు కారణం వారు యీ పదవికి మిక్కిలి తగివుండుటయే. వారు బహుశాస్త్ర కోవిదులు, న్యాయ, ధర్మశాస్త్రిలు, సాహిత్యము, వ్యాకరణము, వేదాంతము, సంగీతము వారికి కరతలామలకములు.

సంస్కృత భాష ఒక్క భారతీయ భాషలకే కాక పాశ్చాత్య భాషలతో సహా ప్రపంచ భాషలకే మాతృక అని నిరూపించుటకు వీరు మహాశ్రమ దాయకమైన పరిశోధనకు పూనుకొనిరి. అష్టావధాన, శతావధానములలో వీరిది అందెవేసిన చేయి. పలుమారులు వీరు యీ అవధానములను చేసి తమ శక్తిని చాటారు.

వీరు పెక్కుగ్రంథములను కూడ ప్రచురించారు. వాటిలో కొన్ని యివి :

సంస్కృత బాలబోధిని—మూడు భాగాలు; వాల్మీకి (సంస్కృత గద్య రచన) ; సంవాదం (సంస్కృత సంభాషణ) ; క్రియదర్శ (క్రియా సంబంధమైన వ్యాకరణం) ; మామూలు నిఘంటువు. "మాతృభాష" అనే సంస్కృత మాసపత్రికకు వీరు కొన్ని దశాబ్దాలుగా సంపాదకులుగా పని చేస్తున్నారు.

# "రవీంద్ర భారతి"

*హైదరాబాదులోని రవీంద్ర భారతి థియేటర్‌ను 1961 మే 11 వ తేదీన ఉపరాష్ట్రపతి ప్రారంభించారు. ఆ సందర్భంలో యీ కొత్త థియేటర్‌కి సంబంధించిన వివిధ ప్రత్యేకాంశాలను రాష్ట్ర విద్యాశాఖామంత్రి శ్రీ ఎస్. బి. పి. పట్టాభి రామారావు తమ నివేదికలో వివరించారు. వివరాలు సంగ్రహంగా దిగువ యివ్వబడినవి.*

రవీంద్రనాథటాగూరు స్మృతి చిహ్నంగా ఆ మహాకవి శత జయంత్యుత్సవానికి ఒక థియేటర్‌ను నిర్మించమని కేంద్ర ప్రభుత్వం సూచించినప్పుడు మేము ఆనందంతో అంగీకరించాము. కేంద్ర ప్రభుత్వం మొదట పైకప్పు లేని థియేటర్‌ని నిర్మించ మన్నది. కాని, హైదరాబాదు శీతోష్ణ పరిస్థితుల దృష్ట్యా పైకప్పు గల భవనమే అవసరమని మేము భావించాము. అందు కను గుణంగానే రవీంద్ర భారతి నిర్మాణానికి యేర్పాట్లు జరిగినవి.

దీనికి 23-3-1960 న డా. బి. గోపాలరెడ్డి శంకుస్థాపన చేశారు. ఆయన యీ వేళ యీ వుత్సవానికికూడా రావడం యెంతో ముదావహం. హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలను కలిపే రెండు ముఖ్యమైన రోడ్లకూడలిలో ఉండి శాసన సభాభవనాలకు యెదు రుగా ఉన్న యీ స్థలం యెంతో ఆకర్షణీయమైనది. దీని విస్తీర్ణం రమారమి 3 యెకరాలు. రాబడి పన్ను కార్యాలయాల నిర్మాణానికై యీ స్థలాన్ని వెనుక కేంద్ర ప్రభుత్వం కొన్నది. అయితే రవీంద్ర భారతి థియేటర్ నిర్మాణానికై యీ స్థలాన్ని యిచ్చి దానికి బదులు బ్యాండ్‌లైన్ల సమీపంలోని మరొక స్థలాన్ని పుచ్చుకొనమని రాష్ట్ర ప్రభుత్వం చెప్పగా అందుకు కేంద్ర ప్రభుత్వం ఆమోదించినది.

కుర్చీలు, బల్లలు మున్నగు సాధన సంపత్తితో సహా యీ థియేటర్‌కి మొత్తం రూ 16.4 లక్షలు ఖర్చుకాగలవు. ఇందులో రూ 2½ లక్షలను, కేంద్ర ప్రభుత్వం యిచ్చినది. అయితే యిందుకు మూడు షరతులను విధించినది. మేము వాటికి అంగీకరించాము. అందులో మొదటిది యీ థియేటర్‌ని టాగూర్ శత జయంత్యుత్స వాల ప్రారంభం రోజున తెరవాలనేది. రెండవది, దానికి రవీంద్ర నాథ టాగూర్ పేరు వుంచాలనేది. మూడవది, ప్రారంభోత్సవం నాడు టాగూర్ నాటకాలలో ఒకటి ప్రదర్శింపబడాలనేది. ఈ వుత్స వానికి అధ్యక్షత వహిస్తున్న కేంద్ర వైజ్ఞానిక పరిశోధన, సాంస్కృతిక సంబంధాల మంత్రి ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్‌కి యీ షరతులన్నీ నెరవేర్చబడిన వన్న సంతృప్తి కలిగిన దనే భావిస్తాను.

ఇందుకు సంబంధించిన వారందరు సమష్టిగా కృషి చేయటం వల్ల యీ భవనం 9½ నెలల్లోనే దాదాపు పూర్తి అయి, యీ నాడు యిక్కడ యీ వుత్సవం జరపడానికి వీలు కలిగినది. అయితే నిర్మాణం అంతా పూర్తి అయిననాడు యిది పెక్కు విషయాలలో నేటికంటె భిన్నంగా వుంటుంది. నాటక మందిరం పైన డాబా నిర్మించబడుతుంది. భవనానికి లోపల బయట కూడ మరి కొన్ని అలంకరణలు చేయబడతవి. దీపాలకు, కూర్చునేందుకు శాశ్వత మైన యేర్పాట్లు చేయబడతవి.

ఈ భవనం మొత్తం 22,000 చ.అ. స్థలంలో నిర్మించబడినది. పూర్తి అయిన పిమ్మట పైకి యిది చూడటానికెంతో బాగుండ గలదు. ముందరగల యెత్తైన ప్రదేశము, అక్కడినుంచి సింహ ద్వారానికిగల సోపాన పంక్తులు, విశాలమైన అద్దాల కిటికీలు, వాటికిగల అల్యూమినియం స్క్రీన్‌లు యివన్నీ ప్రముఖమైన స్థలంలో స్మృతి చిహ్నంగా నిర్మితమైన యీ భవనానికి తగిఉండగలవు. ఇరుపైపులా భారతీయ నాటక సంగీత సంప్రదాయ బద్ధమైన శిల్పాలు వుండగలవు. భవనమంతా ఆధునిక భారతీయ నిర్మాణ శిల్పానికనుగుణంగా వుండ గలదు.

సింహద్వార ప్రదేశము, విశ్రాంతి గదులనేల పాలరాతితో చేయబడినది. విశ్రాంతి గదిలో వైద్య భూషణ్‌చే చిత్రించబడిన రవీంద్రనాథ టాగూర్ నిలువెత్తు చిత్రం వున్నది. శ్రీ డి.పి. రాయ్‌చౌదరి తయారుచేసిన టాగూర్ కంచువిగ్రహం — ఊర్ధ్వభాగం కలది — కూడ యిక్కడ వుంచబడుతుంది.

## విసనకర్ర ఆకారం

నాటక మందిరంలో దిగువ 800 మంది, డాబాపై 350 మంది కూర్చొనుటకు వసతి వుంటుంది. కూర్చొనే స్థలం విసనకర్ర

ఆకారంలో వుంటుంది. వేదికనుంచి దీనికిగల లోతు గరిష్ఠ ప్రమాణం 78 అడుగులు. ఈ యేర్పాటువల్ల మిక్కిలి దూరాన కూర్చున్నవారికి కూడా పాత్రల సహజ కంఠస్వరం వినబడుతుంది. నాటక మందిరం డిజైన్ అతి నిరాడంబరంగా వుంటుంది. ఇందువల్ల ప్రేక్షకుల దృష్టి వేదికనుంచి యితరత్రా మరలే అవకాశం వుండదు. ధ్వని సమస్య విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొనబడుతున్నది. నాటక మందిరం గోడలు, పైకప్పులకు ధ్వని బందోబస్తు చేయబడుతున్నది. దీనికి ముందు ధ్వని విషయంలో జాగ్రత్తగా పరీక్షలు చేయబడతవి. ఈ పని, న్యూ ఢిల్లీలోని నేషనల్ ఫిజికల్ లేబొరేటరీలకు సంబంధించిన నిపుణుల సలహాతో జరుగుతున్నది. ధ్వని బందోబస్తుకి కేవలం భారతదేశంలో తయారైన వస్తువులనే వాడుతారు.

ఈ భవనంలో గమనార్హమైన అంశం వేదిక పరిమాణం. దీని వెడల్పు 100 అడుగులు, లోతు 50 అ, యెత్తు 40 అ. దీనికి కొయ్యనేల నేల, మాళిగ వున్నవి. ముందు వాద్య సమ్మేళనం కూర్చొనేందుకు వసతి వున్నది. ఈ నాటక మందిరానికి ఆధునిక నాటకావసరములైన సాధన సామగ్రి నంతను సమకూర్చుటకు కృషి జరుగుతున్నది. పాత్రధారుల నిమిత్తం గ్రీన్‌రూమ్ములు నిర్మించబడినవి.

ఆఖరికి యీ భవనం ఎయిర్ కండిషన్ చేయబడుతుంది. ఇందుకు తగిన యేర్పాట్లు యిప్పటినుంచే చేయబడుతున్నవి.

ఈ నాటకమందిరం నిర్వహణకు వుద్యోగులు, రాష్ట్ర అకాడమీల సభ్యులతో కూడిన సంఘాన్ని యేర్పాటు చేయాలని ప్రభుత్వ సంకల్పం. నాటకాలు, తదితర సాంస్కృతిక కార్యక్రమాలు నడపగోరు కళాకారులకు రవీంద్ర భారతి స్వాగతం చెబుతుంది. ఈ సౌకర్యాలు పూర్తిగా వినియోగించుకో బడగలవని ఆశిస్తాను. పూర్వ కవులు వ్రాసిన ఉత్తమ నాటకాల ప్రదర్శన ఆధునిక రచయితల నాటకరచనను ప్రోత్సహిస్తుందనీ, యెన్నో క్రొత్త నాటకాలు యిక్కడ ప్రదర్శింప బడగలవనీ ఆశిస్తాను.

---

ధర్మబుద్ధిగలవారు తమవిధులన్నీ సక్రమంగా నిర్వర్తిస్తారు. ధర్మబుద్ధి లేనివారు తమ జీవితావసరాలను గురించి ఆరాట పడతారు.

—లావోజే

*            *            *            *

ఉపనిషత్తులలో చెప్పిన ఈశ్వరుడే పరమాత్మ. మనవాస్తవ జ్ఞానంలో, ప్రేమలో, సేవాభావంలో ఆయన మహిమయే ప్రతిభాసిస్తుంది. స్వార్థ పరిత్యాగ మార్గాన మన అంతరంగంలో ఆయనను సాక్షాత్కరింప జేసుకొనటమే జీవిత పరమార్థం.

—టాగూర్

# పారిశ్రామిక విశేషాలు

## (1961 ఏప్రిల్)

(రాష్ట్రపారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధి పథకాలు ప్రవేశ పెట్టబడుతున్నాయి. వాటినిగూర్చి తెలుసుకోవడం, పారిశ్రామిక వేత్తలకూ, ప్రజలకూ ముఖ్యం. కాబట్టి ముఖ్యపారిశ్రామిక విశేషాలు యీ శీర్షికక్రింద యివ్వ బడుతున్నవి.)

భారీ విద్యుచ్ఛక్తి పరికరాల వుత్పత్తికై దక్షిణాదిని రెండవ ఫ్యాక్టరీ స్థాపన విషయంలో కేంద్ర ప్రభుత్వం యింకా పరిశీలనలు జరుపుతూనే ఉన్నది. ఈ సందర్భంలో 28-4-61 న భారీ విద్యుచ్ఛక్తి పరికరాల టెక్నికల్ డైరెక్టరు, భోపాల్, శ్రీహాయత్ రాష్ట్ర ప్రభుత్వపు సీనియర్ ఆఫీసర్లతో హైదరాబాదులో మరి కొన్ని విషయాలు చర్చించారు.

*'ప్రిసిషన్ పరికరాలు'*

తృతీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో కేంద్ర విభాగంలో కేంద్ర ప్రభుత్వం నెలకొల్పనున్న 'ప్రిసిషన్' పరికరాల ఫ్యాక్టరీ స్థాపన స్థల నిర్దేశానికై రష్యన్ నిపుణులతోసహా కేంద్ర ప్రభుత్వోద్యోగులు ఏప్రిల్ మధ్యలో హైదరాబాదు వచ్చారు. ఈ వచ్చిన వారు.ఫ్యాక్టరీ స్థాపనకు వుద్దేశించిన స్థలాలను పరిశీలించి రాష్ట్ర ప్రభుత్వోద్యోగులతో చర్చలు జరిపారు.

*"లో టెంపరేచర్ కార్బొనైజేషన్ ప్లాంటు"*

కొత్తగూడెంవద్ద, బూడిదశాతం యెక్కువగల బొగ్గును ఎక్కువ బాగుగా చవుకగా వాడటానికై 'లో టెంపరేచర్ కార్బొనైజెషన్ ప్లాంటును'' నెలకొల్పాలన్న ప్రతిపాదన యింకా కేంద్ర ప్రభుత్వం ఆలోచనలో ఉన్నది.

*తక్కువ రేట్లకు విద్యుచ్ఛక్తి సరఫరా*

రాష్ట్రంలో కొత్త పరిశ్రమల స్థాపనను ప్రోత్సహించుటకై 1961 ఏప్రిల్ తరువాత నెలకొల్పిన పరిశ్రమలకు తక్కువరేటుకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయాలని ప్రభుత్వం నిర్ణయించినది. పారిశ్రామిక సంస్థలో ఉత్పత్తి ప్రారంభమైన అయిదు సంవత్సరాలవరకు యీ మినహాయింపు సౌకర్యం వుంటుంది. రేట్లలోని యీ తగ్గింపు ప్రస్తుత పు రేట్లలో 25-50 శాతం వరకు వుంటుంది. ఇది నిర్ణీతమైన కొన్ని తరగతుల పరిశ్రమలకు లభిస్తుంది. ప్రతి దరఖాస్తు దాని యోగ్యతనుబట్టి పరిశీలింప బడుతుంది. ఈ యోగ్యతలను ప్రభుత్వ పరిశ్రమలు, ఆర్థిక, పబ్లిక్ వర్క్సు శాఖల కార్యదర్శులు,విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల చీఫ్ఇంజనీరు, పరిశ్రమల డైరెక్టరులతో కూడిన సంఘం పరిశీలిస్తుంది. తక్కువ రేట్ల విపుల ప్రణాళికకు తుదిరూప మివ్వబడుతునది.

కొత్త పరిశ్రమల స్థాపనను ప్రోత్సహించుటకై పారిశ్రామిక ముడిసరుకులపై అక్ట్రాయిపన్నును తగ్గించడం, అమ్మకం పన్నుపై రిబేటు యివ్వడం వాంఛనీయమేమో కూడ పరిశీలించబడుతున్నది.

*పరిశ్రమలు (అభివృద్ధి, రెగ్యులేషన్) చట్టంక్రింద లైసెన్సులు*

కొత్తగూడెం ఫెర్టిలైజర్ ప్రాజెక్టును ప్రైవేటు విభాగంలో ఒక పార్టీకి బదిలీ చేయవలెనని ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వంతో సంప్రదించి, నిర్ణయించినది. ఆ ప్రకారం కేంద్ర ప్రభుత్వం తణుకు ఆంధ్ర షుగర్సు లిమిటెడ్‌కి లైసెన్సు యిచ్చినది. ఫ్యాక్టరీ సాలుకు 150000 టన్నుల మూత్రికలను (యూరియా) తయారు చేయగలిగి వుంటుంది. దీనిని ఆంధ్ర ప్రదేశ్ షుగర్సు లిమిటెడ్, శేషశాయి బదర్సు (ప్రైవేటు) లిమిటెడ్‌లు సమిష్టిగా నిర్మిస్తాయి.

పెథిడెన్ హైడ్రో క్లోరైడ్ తయారీకి, ఉక్కు కడ్డీల తయారీకి కొత్త ఫ్యాక్టరీని నెలకొల్పుటకు ప్రైవేటు సంస్థలకు కేంద్ర ప్రభుత్వం లైసెన్సులను యిచ్చినది. చిత్తుకాగితాలు, గుడ్డపేలికలు, వరిగడ్డిలనుంచి వ్రాతకు, అచ్చుకు పనికివచ్చే కాగితం తయారీకై హైద్రాబాదులో ఒక పేపరుమిల్లు స్థాపనకై స్థానిక వ్యాపారసంస్థ కొకదానికి లైసెన్సు యివ్వబడినది.

ముతక, ఒకమోస్తరు సన్న బట్టల తయారీకి కొత్త వస్త్రాల మిల్లుల యేర్పాటును, ప్రస్తుతం వైజ్ఞానిక పరికరాలను తయారు

చేస్తున్న కేంద్రాల విస్తరణను అర్థించే దరఖాస్తులు కేంద్ర ప్రభుత్వానికి సిఫార్సు చేయబడినవి.

రాష్ట్రంలో ఇనుం తయారీ (పిగీఐరన్) ప్లాంటు స్థాపనకై వచ్చిన దరఖాస్తులు పరిశీలనలో ఉన్నవి.

చిన్న పంచదార ఫ్యాక్టరీలను చెఱకు సెస్సునుంచి మినహాయించే విషయం పరిశీలనకై ప్రభుత్వం ఒక సంఘాన్ని యేర్పాటు చేసినది. దాని సభ్యులు వీరు: నిజాం షుగర్ ఫ్యాక్టరీ లిమిటెడ్ జనరల్‌మేనేజరు, పరిశ్రమలు, వ్యవసాయ శాఖల డైరెక్టర్లు.

*సింగరేణి బొగ్గుగనుల కంపెనీ లిమిటెడ్*

సింగరేణి బొగ్గుగనులలో బొగ్గు వుత్పత్తి మరల హెచ్చినది. 1961 మార్చిలో అది 2,15,430 టన్నులు. క్రితం సంవత్సరం అదేకాలానికి యిది 2,00, 013 టన్నులు. 1961 మార్చి ఆఖరు నాటికి 6,52, 106 టన్నులు వుత్పత్తి చేయబడినవి. క్రితం ఏడాది వుత్పత్తికంటె యిది 51,000 టన్నులు హెచ్చు.

*ప్రాగాటూల్సు కార్పొరేషన్ లిమిటెడ్*

మెషిన్ టూల్సు ఉత్పత్తి స్థాయిని సాలుకు రూ॥ 12 లక్షల నుంచి రూ॥ 120 లక్షలకు హెచ్చించుటకై ప్రాగాటూల్సువారు పోలెండులోని సిఇకె ఒపి సంస్థతో బేరం చేస్తున్నారు. ఇందు నిమిత్తం "డీసైల్లు ప్రాజెక్టు పోష్టుల" సరఫరా విషయంలో అప్పుడే ఒప్పందం కుదిరింది. ఈ ప్రాజెక్టుపై జరిగే విదేశ వ్యయం కేంద్ర ప్రభుత్వానికి పోలెండు యిచ్చే అప్పులోనుంచి పెట్టుబడుతుంది.

*నిజాం షుగర్ ఫ్యాక్టరీ లిమిటెడ్*

నిజాం షుగర్ ఫ్యాక్టరీ విస్తరణక్రింద వివిధ యూనిట్ల స్థాపన పని చురుగ్గా జరుగుతున్నది. ఈ ఫ్యాక్టరీ 1961-62 సీజన్‌లో ప్రతి దినము ఆడేచెఱకు ప్రమాణాన్ని 3,200 టన్నులనుంచి 4,200 టన్నులకు హెచ్చించ గలుగుతుంది.

1961 సీజన్ వుత్పత్తి బాగా హెచ్చినది. 1961 మార్చి ఆఖరు నాటికి 5,40, 168 బస్తాల (క్వింటాల్) పంచదార వుత్పత్తి అయినది. అంత క్రితం సంవత్సరం యిదే కాలానికి యీ వుత్పత్తి 4,39,970 బస్తాలకు మాత్రమే.



నాదృష్టిలో ఈ విశ్వం సజీవ మైనది. నా జీవితానికి అత్యంత సన్నిహితమైనది. ఈ బాంధవ్యం నా జీవితమంతటా వ్యాపించి నా జీవనపు విలువను హెచ్చిస్తున్నది.

—*టాగూర్*

# సంగ్రహ ప్రకటనలు

## పోలియోవ్యాధి నిరోధ కార్యక్రమము

రాష్ట్రంలో పోలియో నిరోధానికి సబిన్ వాక్సిన్ బాగా పనిచేస్తుందని ప్రభుత్వానికి నిపుణులు సిఫార్సు చేశారు. ఈ మందు బిళ్ళలు అనేక దేశాలచే వాడబడేవే. ఇవి, నిరపాయమైనవి, నివారణ ఇచ్చేవి అని తేలినది.

ఈ వ్యాధి నివారణ రెండు సూత్రాల విజయంపై ఆధారపడివుంది. జన్మించినదాది 6–7 సంవత్సరాల వయసు పిల్లలందరికీ నూటికి నూరుమందికి యీ మందు ఇవ్వటం ఒకటి. రెండోది - 5, 7 రోజులలోపలే యీ కార్యక్రమాన్ని 1,00,000 మంది పిల్లలకు చొప్పున వర్తింప జేయటం. ఈ ఉద్యమంలో వైద్యవృత్తి నవలంబిస్తున్న వారందరి హృదయపూర్వక సహకారాన్ని ప్రభుత్వం అర్థిస్తున్నది. వ్యాధి ఏ జిల్లాలలో ఎక్కువ వ్యాప్తి చెందివున్నదో అక్కడ ముందుగా మందు ఇచ్చే కార్యక్రమం ప్రారంభం కావాలి. తరువాత యితర ప్రాంతాలకు, త్వరత్వరగా యీ కార్యక్రమం విస్తరింప చేయబడుతుంది.

భారత వైద్య పరిశోధక మండలివారు బొంబాయిలోని పోలియో పరిశోధక కేంద్రం నుండి ఒకజట్టును, వ్యాధిమూల కారణాన్ని, వ్యాపక హేతువును పరిశీలించుటకై పంపారు. వీరు మూడు వారాల తీవ్ర కృషి అనంతరం పరిశీలనకు తగిన సమాచారాన్నెంతో సేకరించారు. వీరు బొంబాయి వెళ్లిన పిమ్మట యీ వివరాలను పరిశీలించి లేబొరేటరీ పరీక్షలు జరుపుతారు. గుంటూరు వైద్య కళాశాల సూక్ష్మక్రిమిశాఖ సిబ్బందిలో యిద్దరు రెండు నెలల శిక్షణకై వారితోపాటు బొంబాయి వెళతారు.

## యాత్రికులకు అతిథి మర్యాదలు

విదేశ యాత్రికులు, మనదేశ యాత్రికులుకూడ ఇక్కడి ప్రజలతో సన్నిహితంగా మెలగడానికి వీలుగా రాష్ట్ర సమాచార, పౌరసంబంధములశాఖ ఒక అతిథి మర్యాదల పథకాన్ని రూపొందించింది.

ఈ పథకం మూడు భాగాలుగా విభజించబడినది :— (అ.) యాత్రికులను అప్పుడప్పుడు వినోద కార్యక్రమాలతో ఆదరించమని, (ఆ.) భోజన, వసతి సౌకర్యాలను ఉచితంగా కల్పించమని, (ఇ) తగుమాత్రం ఖర్చులు పుచ్చుకొని యాత్రికులను పేయింగ్ గెస్టులుగా వుండనివ్వమని టూరిస్టు బ్యూరో పౌరులను కోరుతుంది.

యాత్రికులకు సమాచారార్థమై ఇటువంటి గృహస్థుల పట్టికలు అన్ని యాత్రిక సమాచార కేంద్రాలకూ, ట్రావెల్ ఏజంట్లకూ, వసతి గృహాలకు పంపించబడుతాయి.

ఈ పథకం పట్ల ఆసక్తి వున్నవారు హైద్రాబాదు సమాచార, పౌరసంబంధముల శాఖలోని యాత్రిక సమాచార కేంద్రం ఇన్‌ఛార్జి అధికారికి వ్రాసి యిందునిమిత్తం పూర్తి చేయవలసిన నిర్ణీత ఫారములు తెప్పించుకోవచ్చును.

## భద్రాచలంవద్ద గోదావరి వంతెన నిర్మాణం

భద్రాచలంవద్ద గోదావరి వంతెననిర్మాణంపై మార్చిలో ఒక వార్తాపత్రికలో ప్రచురింపబడిన వార్తను ఖండిస్తూ ఒక పత్రికా ప్రకటనలో ప్రభుత్వం దిగువ విధంగా పరిస్థితిని స్పష్టం చేసినది: 1959వ సంవత్సరం మొదట్లోనే ప్రభుత్వం ఆమోదం పొందిన యీ పథకాన్ని శీఘ్రగతిని అమలుపరచే ఉద్దేశంతో, యీ పని అంచనాలకు భారత ప్రభుత్వంనుంచి సాంకేతికమైన ఆమోదం లభించని పూర్వమే ప్రభుత్వం యీ పనికి టెండర్లను పిలిపించి వాటిని ప్రభుత్వ కన్‌సల్టింగ్ ఇంజనీరు శ్రీ ఎల్. వెంకటకృష్ణ అయ్యర్, నీటి వనరుల విభాగం ఛీఫ్ ఇంజనీరు శ్రీ ఎ. ఆర్. వెంకటరామన్, రహదార్ల విభాగం ఛీఫ్ ఇంజ

నీరు శ్రీ ఎన్. దుర్రానీలతో కూడుకున్న సాంకేతిక సంఘం చేత పరిశీలన జరిపించింది. ఈ సంఘం చేసిన సిఫార్సులను పురస్కరించుకొని టెండర్లన్నింటిలోకి ఆమోద యోగ్యంగా వున్న మెస్సర్స్ పటేల్ ఇంజనీరింగ్ కంపెనీ ప్రయివేటు లిమిటెడ్ వారి టెండరును ప్రభుత్వం ఆమోదించింది. పని ప్రారంభింపబడినది కూడ. మెస్సర్స్ పటేల్ ఇంజనీరింగ్ కంపెనీ ప్రయివేటు లిమిటెడ్, బొంబాయిలోని ప్రసిద్ధ సంస్థ. నాగార్జునసాగర్ ప్రాజెక్టు కుడి, ఎడమ కాలువల సొరంగం పనులనూ, హైదరాబాదులో జాతీయ నాటకమందిరం నిర్మాణంవంటి పనులను ఇది చేపట్టినది. రహదార్ల శాఖకు చెందిన ఒక ప్రత్యేక డివిజను యీ వంతెన నిర్మాణవ్యవహారాలను పర్యవేక్షిస్తూ యీ పనులు ఐ. ఆర్. సి. బ్రిడ్జి కోడ్, ఐ. ఎస్. ఐ. స్పెసిఫికేషన్ల ననుసరించి జరుగునట్టు చూస్తున్నది.

ఈ వంతెన విషయంలో జరుగుతున్న పని నాణ్యం విషయమై భారతప్రభుత్వం ఎప్పుడూ ప్రస్తావించడం జరగలేదు. ఈపనికి సంబంధించిన పూర్తిప్లానులు, అంచనాలు పరిశీలనార్థం సాంకేతిక ఆమోదం నిమిత్తం భారత ప్రభుత్వానికి పంపించడం జరిగింది. వంతెన నిర్మాణస్థలంవద్ద పని నిలిచిపోలేదు. పోగా ముఖ్యమైన యీ వంతెన నిర్మాణం నిర్ణీతదశలవారీ కార్యక్రమం ప్రకారం ముగించడానికి చర్యలు తీసుకోబడుతున్నాయి.

## మెట్రిక్ తూకముల వాడకం

దిగువ జిల్లాలలో 1-10-1960 నుంచి మెట్రిక్ తూకముల వాడకం నిర్బంధం చేయబడినది. ఆ జిల్లాలు యివి.

1. హైదరాబాదు, 2. వరంగల్లు, 3. నిజామాబాదు, 4. కృష్ణా, 5. కర్నూలు. 6. గుంటూరు, 7. విశాఖపట్నం.

కాని వ్యాపారస్థులు పాత తూకములను ప్రభుత్వం తీసివేసు కొన్నపిదప కూడా వాటిని వాడుతున్నారుట. ఇకముందు అలాచేసినవారిపై 1958 ఆంధ్రప్రదేశ్ తూకములు, కొలతలు (అమలు) చట్టం 23వ సెక్షన్‌క్రింద చర్య తీసుకొనబడగలదు. ఈ సందర్భంలో రు 2,000 వరకు జుల్మానా విధింపబడవచ్చు.

## మర మగ్గాలు

అనుమతిలేని మరమగ్గాలను క్రమబద్ధంచేసే పర్మిట్లు బొంబాయి, అహ్మదాబాదు, కాన్పూరు, కలకత్తా, కోయంబత్తూరులలోని టెక్స్‌టైల్ కమీషనరు ప్రాంతీయ కార్యాలయాలనుంచి, మద్రాసులోని సబ్-రీజనల్ కార్యాలయంనుండి జారీ చేయబడుతాయనేది మరమగ్గాల యజమానులకు తెలిసిన విషయమే. అనుమతివున్న మరమగ్గాల బదిలీకి, 1956 కి పూర్వపు మగ్గాల రిజిస్ట్రేషనుకు అసంఖ్యాకమయిన దరఖాస్తులు బొంబాయి బల్లార్డ్ ఎస్టేటులోవున్న టెక్స్‌టైల్ కమీషనరు కార్యాలయానికి వచ్చాయి. ఇంకా చర్యలు తీసుకోక వీటిలో చెక్కు అలాగే పడివున్నాయి. బొంబాయిలోని టెక్స్‌టైల్ కమీషనరు వాయిదాలోనున్న బదిలీకేసులన్నిటిపై శీఘ్రంగా చర్య తీసుకోడానికి అనువుగా 1961 జూన్ 30 వరకు బదిలీకై కొత్తగా దరఖాస్తులు స్వీకరించరాదని నిర్ణయించటం జరిగింది.

అనుమతిగల మరమగ్గాల బదిలీకి సంబంధించిన పని అంతా 1961 జూన్ 30 తరువాతనే టెక్స్‌టైల్ కమీషనరుయొక్క ఆయా ప్రాంతీయ కార్యాలయాలు చూస్తాయి.

## ప్రాథమిక విద్యాచట్టం

షెడ్యూల్డుప్రాంతాలు మినహా రాష్ట్రంఅంతటా 1961 వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాచట్టం 1961 ఏప్రిల్ 10 వ తేదీ నుంచి అమల్లోనికి వచ్చినట్టు ప్రభుత్వం ప్రకటించింది.

## టాక్సీ ఛార్జీలు

హైదరాబాదు ప్రాంతీయ రవాణాసంస్థ క్రిందనున్న ప్రాంతంలోని టాక్సీల డ్రైవర్లు 1961 జనవరి 12వ తేదీ నోటీసు ప్రకారం ఛార్జీలు వసూలుచేయాలని చెప్పడమైనది. నోటీసు ప్రతిని కారులో అంటించి వుంచటాన్కి వీలుగా అవి వారికి యివ్వబడినవికూడా. ఒకవేళ టాక్సీడ్రైవర్లు నిర్ణీత రేటుకంటె హెచ్చుఛార్జీలు అడగటంగానీ లేదా నోటీసు నిబంధనలను పాటించ నిరాకరించడంగాని జరిగితే ప్రయాణీకులుసమీపంలో నున్న ట్రాఫిక్ పోలీసు స్టేషనులోగానీ లేదా హైద్రాబాదు లోని ట్రాఫిక్, లైసెన్సింగ్ డిప్యూటీ పోలీసు కమీషనరుకు గాని ఆ విషయంలో తగుచర్య తీసుకునే నిమిత్తం ఫిర్యాదు **చేయవచ్చు.**

## శానిటరీ ఇనస్పెక్టర్ల పరీక్షలు

1961 జూన్—జూలై శానిటరీ ఇనస్పెక్టర్ల సర్టిఫికెటు రెండవ భాగం (లిఖిత) పరీక్షలు దిగువ పేర్కొన్న తేదీలలో

జరుగుతాయి :

| | | |
|---|---|---|
| 29-6-1961 ఉ. 10 గం.లనుంచి మ. 1 గంటవరకు | | పారిశుద్ధ్యం, పరిశుభ్రత. (శానిటేషన్ అండ్ హైజీన్) |
| 27-6-1961 | ,, ,, | ప్రథమచికిత్స, వాక్సినేషన్‌తో సహా ప్రివెంటివ్ మెడిసిన్. |
| 28-6-1961 | ,, ,, | వైటల్ స్టాటిస్టిక్స్‌తో సహా ప్రజారోగ్యము. (పబ్లిక్ హెల్తు అడ్మినిస్ట్రేషన్) |

అన్ని విషయాలలోనుకూడ లిఖిత, మౌఖిక, ప్రాక్టికల్ పరీక్షలు హైద్రాబాదులోని ఉస్మానియా మెడికల్ కాలేజి, విశాఖపట్నంలోని ఆంధ్ర వైద్య కళాశాల, గుంటూరు వైద్య కళాశాలల్లో జరుగుతాయి.

ఈ పరీక్షలకు కూర్చునే అభ్యర్థుల రిజిస్టరు నెంబర్లను పరీక్ష ప్రారంభం కావడానికి మూడు రోజులుముందు హైద్రాబాదు ఉస్మానియా మెడికల్ కాలేజి, విశాఖపట్నం ఆంధ్ర మెడికల్ కాలేజి, గుంటూరు మెడికల్ కాలేజి సాంఘిక నిరోధక, వైద్య శాఖ నోటీసు బోర్డులలో ఉంచుతారు.

## అప్పిలేట్ ఆఫీసర్లు

శాసనసభ నియోజకవర్గాలకు అప్పిలేట్ అధికార్లుగా ఎన్నికలసంఘం జిల్లాకలెక్టర్లను నియమించింది. ఒక్కొక్క కలక్టరు తన రెవిన్యూ ఆధిపత్యంక్రింద గల ప్రాంతానికి అప్పిలేట్ అధికారిగా వుంటాడు. హైదరాబాదు నగర సరిహద్దుల్లోవున్న నియోజకవర్గాల విషయంలో హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ కమీషనరు, హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ సికింద్రాబాదు డివిజను అడిషనల్ కమీషనర్లు తమతమ ఆధిపత్యం క్రిందగల ప్రాంతాలలో అప్పిలేట్ అధికార్లుగా వ్యవహరిస్తారు.

## కాలేజీఫీజు హెచ్చింపు

1961–62 విద్యాసంవత్సరంనుంచి వివిధకోర్సుల ట్యూషన్ ఫీజు హెచ్చించటానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం నిర్ణయించినది. ఇది కొత్తగా ప్రవేశించేవారికి మాత్రమే వర్తిస్తుందే కాని ఒకానొక కోర్సులో ప్రస్తుతంవున్న విద్యార్థులకు వర్తించదు. 1962 నుంచి పరీక్ష రుసుంకూడా హెచ్చించాలని నిర్ణయించబడినది. మెమోరండం రుసుం రుకను విలీనం చేయాలని యింతకుముందు చేసిన నిర్ణయం వుపసంహరించుకొనబడినది. మెమోరాండానికి ప్రత్యేక రుసుం వసూలుచేసే ప్రస్తుతఆచారం కొనసాగించబడుతుంది.

## కమిటీ నియామకం

రాష్ట్రంలో సహకార పంచదార ఫ్యాక్టరీల అభివృద్ధిని నెలకొకసారి సమీక్షించుటకై ప్రభుత్వం "సహకార పంచదార ఫ్యాక్టరీల సంఘం" అనేదానిని యేర్పాటుచేసినది. ఇందులో యేడుగురు సభ్యులు వుంటారు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి దీనిఅధ్యక్షులుగా వుంటారు.

## ఎంట్రన్స్ పరీక్షలు

రాష్ట్ర సాంకేతిక విద్య, శిక్షణాసంఘం, సివిల్, ఆటోమొబైల్, ఎలెక్ట్రికల్, మెకానికల్ ఇంజనీరింగ్ డిప్లమో కోర్సులలో నడిపే ఎంట్రన్స్ పరీక్షలను 1960 నవంబరు–డిసెంబరునుంచి నిలిపివేయాలని ప్రభుత్వం ఆదేశించినది.

## శ్రీశైల దేవాలయ సంఘం

శ్రీశైల దేవాలయ అభివృద్ధి, పునరుద్ధరణలకు వలసిన యేర్పాట్లు చేయటానికి, అందు నిమిత్తం ప్రజల నుంచి విరాళాలు సేకరించటానికి రాష్ట్ర ప్రభుత్వం "శ్రీశైల భ్రమరాంబా మల్లి ఖార్జున ఉద్ధరణ సంఘం" అనే దానిని యేర్పాటుచేసినది. ఈ సంఘం ప్రధాన పోషకులు ముఖ్యమంత్రి. ప్రచాళికలు, సమాచార శాఖామంత్రి శ్రీ పి. రంగారెడ్డి దాని అధ్యక్షులు.

## ఐచ్ఛిక సెలవులు

ఇచ్ఛిక సెలవుదినంనాడు అత్యవసరమైన ప్రభుత్వ పని మూలంగా ప్రభుత్వోద్యోగికి సెలవు నిరాకరించటం జరిగితే ఆ రోజుకు బదులు మరొకరోజు ఎప్పుడైనా వాడుకోటానికి అనుమతించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఐతే ఏరకంగానైనా ఐచ్ఛిక సెలవులుగా వాడినవి సంవత్సరానికి మూడుకంటె ఎక్కువ కారాదు.

## అనంతపురం జిల్లాలో సహాయకచర్యలు

1370 ఫస్లీలో అనంతపురం జిల్లాలో అనావృష్టివల్ల దెబ్బతిన్న ప్రాంతాలకు ప్రభుత్వం దిగువ పేర్కొన్న సహాయక చర్యలను మంజూరు చేసింది.

1. 1370 ఫస్లీ సంవత్సరంలోనూ, అంతకుముందు రెండు ఫస్లీ సంవత్సరాలలో కూడా ఏదోఒక సంవత్సరంలోనన్నా

పంటలు దెబ్బతిన్న గ్రామాలకు అరణాలు అంతకు తక్కువ వంతున పండిన మెట్టభూములకు 1370 ఫస్లీలో పూర్తి శిస్తు మాఫీ.

2. అంతకుముందు రెండు సంవత్సరాలలో దెబ్బ తినకుండా 1370 ఫస్లీ సంవత్సరంలో మాత్రమే దెబ్బతిన్న గ్రామాలలో 1370 ఫస్లీకి శిస్తు, నాలుగణాలు అంతకు తక్కువ వంతున పండినవాటికి పూర్తిమాఫీ. నాలుగణాలకు పైన అరణాలకు అంతకు తక్కువ వంతున పండినవాటికి సగం శిస్తుమాఫీ.

3. తక్కావీ రుణాల వాయిదాల వసూలును ఒక సంవత్సరం పాటు నిలిపి వుంచటం.

4. వాణిజ్య పంటల ప్రత్యేక శిస్తు 1370 ఫస్లీది, అంతకుముందు అప్పులువసూలు చేయడం ఒక సంవత్సరం వాయిదా.

5. అనంతపురం, గుత్తి, ధర్మవరం, కల్యాణదుర్గం, రాయదుర్గం, పెనుకొండ, హిందూపురం, మడకశిర, తాడిపత్రి తాలూకాలలోనూ, ఉరవకొండ సబ్ - తాలూకాలోని గ్రామాలలో దెబ్బతిన్న భూములలో అరణాలు అంతకు తక్కువ వంతున పండిన వాణిజ్యపంటలపై 1370 ఫస్లీకి సంబంధించిన స్పెషల్ అసెస్‌మెంటు పూర్తి మాఫీ.

దెబ్బతినని కదిరి, తాడిపత్రి తాలూకాలలోని గ్రామాల విషయంలో 1370 ఫస్లీలోని రుణాల వాయిదాల వసూళ్లు ఒక వాయిదాకు మాత్రమే పరిమితం చేయాలని అంటే 1370 ఫస్లీ కర్రెంటు వాయిదాపైకం మాత్రం రాబట్టుకుని, మిగతా వాయిదాలన్నిటిని ఒక సంవత్సరం పాటు నిలిపివుంచాలని ప్రభుత్వం ఆదేశించింది.

*పంటల పరిస్థితి*

1960–61 లో రాష్ట్రంలో 1,154 ఎకరాలలో అల్లం పంట వేయబడినదిట. క్రిందటి సంవత్సరం యీ విస్తీర్ణం 1,038 ఎకరాలు మాత్రమే. అనగా యీ సంవత్సరం ఈ పంటభూమి 11 శాతం హెచ్చినది. ఈ పంట విశాఖపట్నం, హైదరాబాదు. మెదక్‌జిల్లాల్లో ముఖ్యమైనది. ఈ మూడు జిల్లాల్లోను రాష్ట్రంలో ఈ పంటక్రిందగల మొత్తం భూమిలో 87 శాతం వుంటుంది.

మళ్లీ రాష్ట్రంలో బార్లీ పంట క్రిందగలభూమి తగ్గినది. 1961 ఫిబ్రవరి ఆఖరికి 7,100 ఎకరాలలో మాత్రమే బార్లీ వేయబడినది. అంతకు క్రితంసంవత్సరం దీనిక్రింద 8,900 ఎకరాలున్నవి. అనగా తరుగుదల 20 శాతం. ఈ పంట హైదరాబాదు, మెదక్‌జిల్లాల్లో ముఖ్యమైనది. రాష్ట్రి మొత్తంమీద దీనిక్రిందగల ప్రాంతంలో 92 శాతం ఈ రెండుజిల్లాల్లోను వుంటుంది.

*ఆంధ్రప్రదేశ్ తూకములు, కొలతలచట్టం*

1958 ఆంధ్రప్రదేశ్ తూకములు, కొలతల (అమలు) చట్టం నిబంధనలక్రింద, యిందుకు సంబంధించిన ప్రకటన ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రకటించబడిన తేదీ అనగా 21-3-1961. దిగువ తరగతుల సంస్థల విషయంలో, ఆచట్టం నిబంధనలు అమలులోనికి వచ్చేతేదీగా ప్రభుత్వం నిర్ణయించినది.

1. చేసినపనికి షిప్పింగ్/ఛార్జెస్ వసూలు, తీరం చేరిన నౌకలు లేక సరుకులపై రేవుసుంకాలు మున్నగు వ్యవహారాలుగల రేవులు.

2. సరుకులపై సుంకం విధించే వ్యవహారాల విషయంలో షిప్పింగ్ పరిశ్రమ.



# నాయకమణి, ప్రకాశం

## ఎస్. వి. కొండపి

ఆంధ్ర కేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం, ఆంధ్ర రాజధానిలో ఉస్మానియా జనరల్ ఆసుపత్రిలో 1957 మే 20 వ తేదీన రాత్రి 7-15 గంటలకు తుది నిశ్వాసం విడిచారు. ఈ వార్త క్షణాలలో నగర వ్యాప్తమై పోయింది. తరువాత కొద్ది సేపట్లోనే నగరం నలుమూలలనుంచి వందలకొద్ది జనం ఆసుపత్రి వద్దకు చేరుకున్నారు. ఆ మర్నాడు ఆయన భౌతిక కాయాన్ని ప్రజల దర్శనార్థమై గాంధీ భవనంలో వుంచారు. తమ నాయకాగ్రేసరుని అంతిమ దర్శనానికై అన్నిరకాల ప్రజలు అక్కడికి తండోపతండాలుగా వచ్చారు. అంబర్‌పేట స్మశానవాటిక వరకూ ఊరేగింపులో వెళ్ళారు. ఈ వార్తను పత్రికల్లో చదివిన రేడియోలో విన్న వందలకొద్ది ప్రజలు జిల్లా ప్రాంతాలనుంచి హుటాహుటిన హైద్రాబాదుకు బయలు దేరారు. అయినా వారిలో కొందరు మాత్రమే తమ ప్రియతమ నాయకుని అంత్య దర్శనం చేసుకొనగలిగారు. ఆయనను చివరిసారిగా చూడగలిగినవారు తమకా అదృష్టం దక్కినందుకు సంతృప్తి జెందారు. సకాలంలో చేరుకోలేక పోయినవారు తమ దురదృష్టానికి ఖేదించారు.

ప్రకాశం మరణానికి దుఃఖించని వారుండరు. సుమారు మూడు దశాబ్దాలపాటు, అసమాన త్యాగ నిరతిద్వారా, సేవా తత్పరత ద్వారా అసంఖ్యాకమైన ప్రజా హృదయాలను చూరగొన్న నాయకమణి శ్రీ ప్రకాశం. అయినప్పుడు ఆయన నిర్యాణంవల్ల తనఆప్తుణ్ణి కోల్పోయినంత బాధ ఎవరికి కలుగదు!.

స్వతంత్ర భారతావనిలో ఆంధ్ర ప్రజలకు ప్రత్యేక రాష్ట్రం వుండాలని ప్రకాశంపంతులు 1921 వ సంవత్సరంలోనే సూచన చేశారు. ఈ ధ్యేయంతోనే ఆయన దండిగా ఆర్జించి పెడ్తున్న న్యాయవాద వృత్తిని త్యజించి మొదట దేశ స్వాతంత్ర్యానికై తన సర్వస్వాన్నీ త్యాగం చేశారు. 1947 వ సంవత్సరంలో దేశం స్వతంత్రమైన తరువాత ప్రకాశం ఇతర నాయకులతో కలిసి, తెలుగు ప్రజలకొరకు ప్రత్యేకాంధ్ర రాష్ట్రావతరణకు కృషిసల్పారు.

స్వరాజ్య సాధనకు ఎంత దీక్షతో పనిచేశారో స్వరాష్ట్ర నిర్మాణానికి కూడా ఆయన అంతే పట్టుదలతో కృషి సల్పారు. ఆయన ఆంధ్రుడుగా ఎంత గర్వించారో భారతీయుడుగా కూడా అంతే గర్వపడ్డాడు. రాష్ట్ర సమస్యలకిచ్చినంత ప్రాధాన్యతనే జాతీయ సమస్యలకుకూడా ఆయన ఇచ్చారు. యూనియన్ ప్రభుత్వ అభ్యర్థనను పురస్కరించుకొని శ్రీ ప్రకాశం సరిహద్దు పరిస్థితిని పరిశీలించే నిమిత్తం 1948 అక్టోబరు 30 వ తేదీన క్రొత్తఢిల్లీనుంచి కాశ్మీర్‌కు బయలుదేరారు. అప్పుడు ఆయన వయస్సు 76 సంవత్సరాలు. పరిశీలక బృందం నవంబరు 3 వ తేదీన శ్రీనగర్‌నుంచి తిరిగి వస్తున్నట్టు సమాచారం వచ్చింది. కాని ఆనాడు సాయంత్రం కాశ్మీర్‌నుంచి కొత్త ఢిల్లీకి వచ్చిన విమానంలో డా. పంజాబ్‌రావ్ దేశ్‌ముఖ్, డా. రఘువీర గారలు మాత్రమే దిగారు.

ప్రకాశంగారి సంగతేమిటని అడిగితే, డాక్టర్ దేశ్‌ముఖ్ "ఆయన సంగతి మాకేం తెలుస్తుంది. మేము చేయగలిగిందేముంది? కుర్రవాడిలా 'జన నివాసంలేని ప్రాంతం' కూడా చూడాలని వెళ్ళాడు...."అన్నాడు. 17వేల అడుగుల ఎత్తున్నపర్వత శిఖరానికికూడా తీసుకెళ్ళాలని ప్రకాశం పట్టు బట్టాడని ఆ తరువాత తెలిసింది. ఆ మార్గం ఆ సమయంలో ఆరేడడుగుల మందాన మంచుతో దట్టంగా కప్పి వున్నది. అయితే ప్రకాశంగారి ఉత్సాహం సైనికాధికారులను కూడ ఉత్తేజ పరచింది. ప్రకాశంగారి యీ యాత్రను గురించి ఆ తర్వాత ఒక కల్నల్ చెబుతూ, ఒక చోట ప్రకాశం ఒక పర్వతంనుంచి మరొక పర్వతానికి దాటుతుండగా, కొద్ది సెకండ్లు ఆలస్యం జరిగినా శాశ్వతంగా మంచులో లీనమయి పోయివుండేవాళ్ళమని అన్నాడు. అయినా ఇలాంటి

ప్రమాదాలు కూడిన వాటిలో ప్రకాశం సంతోషాన్ని పొందేవాడు. ఆ పట్టుదల, శక్తితోనే ఎనభై యేండ్ల వయస్సులో ప్రకాశం కుతుబ్ మీనార్ చూడ వెళ్లాడు. నేనూ, మాతోవున్న ఆయన స్నేహితుడు ఒకాయన సగందూరం ఎక్కేటప్పటికే అలిసిపోయాం. ప్రకాశం మాత్రం ఉడుత వేగంతో మాకంటె ముందు కుతుబ్‌మీనార్ ఉపరిభాగం చేరుకుని, అంత ఎత్తునుండి కన్పిస్తున్న ఢిల్లీనగర మనోహర దృశ్యాన్ని చూస్తూ ఆనందిస్తున్నాడు.

జీవితం చివరి ఘడియ వరకు ప్రకాశం తన యావత్తు కాలాన్నీ, శక్తినీ ప్రజల కోసం ధారాదత్తం చేశాడు. ప్రజల ఇబ్బందులు, బాధలు తనవిగా భావించాడు. వారికి లాభదాయకము, శ్రేయస్కరములని తాను భావించిన దాన్ని సాధించడం కోసం చట్ట సంబంధమయిన అడ్డంకులేమీ ఆయన్ను ఆటంకపరచలేదు. పదవిలో వుండగా ముఖ్యమయిన విషయాలపై ధైర్యంగా శీఘ్రగతిని నిర్ణయాలు తీసుకుని, ఇతర రాష్ట్రాలకు మార్గదర్శకుడయ్యాడు. ఆర్థిక శాఖవారు వెనుకాడుతున్నప్పటికిన్నీ, 1946లో నాన్-గజిటెడ్ ఉద్యోగులకు ఒక నెల జీతం బోనసుగా ప్రకటించిన విషయం యీ సందర్భంలో స్మృతికి తెచ్చుకోవడం సముచితం. 1946 లోనే మద్రాసు రాష్ట్రానికి ప్రధాన మంత్రిగా (అప్పుడు ఆ పదవిని ప్రధాన మంత్రిగానే పిలుస్తూ వుండేవారు) వున్నప్పుడు, బడ్జెటులో హరిజనుల సంక్షేమం నిమిత్తం 3 కోట్ల రూపాయలు ప్రప్రథమంగా కేటాయించిన ఘనత ఆయనకే దక్కింది. కేంద్ర ప్రభుత్వమూ, తన సహచరులు, రాష్ట్ర ప్రభుత్వాధికారులూ నాయశాస్త్రరీత్యా ఎదుర్కోవలసి వచ్చే ఇబ్బందులను ఉగ్గడిస్తూ హెచ్చరిక చేసినప్పటికీ, లెక్కచేయక 1953 అక్టోబరు 1 వ తేదీ ఆంధ్రరాష్ట్ర అవతరణ శుభసమయాన ఖైదీలందరినీ విడుదల చేయమని ఆజ్ఞాపించాడు. ఈ సంఘటన అద్వితీయం. ఇలాంటిది అంతకు క్రితం మరెక్కడా జరుగలేదు. ముఖ్యమంత్రి అయినా ప్రకాశంకు లాంఛనాలేవీ వుండేవిగావు. సామాన్యుడు కూడా స్వేచ్ఛగా ఆయన్ను కలుసుకుని తన బాధలేవో నిర్భయంగా చెప్పుకునేందుకు అవకాశాలుండేవి. తక్షణం బాధితుడికి ఏదయినా సహాయం మంజూరు చేయాలంటే, మామూలు పరిపాలనా సంబంధమయిన పద్ధతికి స్వస్తి చెప్పి, దానికి సంబంధించిన అధికారికి ఫోనుచేసి, ఫైలు తెప్పించి అక్కడికక్కడే ఉత్తర్వు వేసేవాడు.

జీవితాంతం ఎలాంటి ఆస్తి ఆయన పరంగాలేదు. నాకు తెలిసినంతవరకు పర్సుగాని, డబ్బుగాని ఆయన దగ్గర వుండేవికావు. గాంధీజీకి 9-4-1946 న తనను గురించి ఒక లేఖ వ్రాస్తూ, ఇలా అన్నాడు. "నా ప్రజలకు, పితృలకు, ఋషులకు, దేవులకు నా విధులన్నీ సక్రమంగా నిర్వర్తిస్తున్నా, నేను స్వేచ్ఛా జీవిని. దేశానికీ, నాకూ తేడాలేదనే నేననుకుంటాను. నేను డబ్బు సంపాదించటమూ లేదు, పొదుపు చేయడమూలేదు....దేశంతో నాకున్న సంబంధమే నా ఆరోగ్యానికీ, నా రక్త ప్రవాహం ద్వారా జరిగే శారీరక, మానసిక శక్తికీ మూలాధారం."

అలాంటివాడు ప్రకాశం. ప్రజలకూ, తన రాష్ట్రానికీ, మీదు మిక్కిలి దేశానికి ఆయన చేసిన నిస్వార్థ సేవా త్యాగాలు అనన్యం, అపారం, అసమానం.

(ఆంగ్ల వ్యాసానికి అనువాదం)



# విశేషాలు

*చాళుక్య నాణెములు*

మహబూబాబాదు తాలూకా గుండేపల్లి గ్రామంలో ఒక చెరువుగట్టును బలపరిచేందుకై మట్టి త్రవ్వుతుండగా 64 బంగారు నాణెములు, బహుశా ఆంధ్రను పరిపాలించిన చాళుక్యరాజులకు చెందినవి, దొరికినవి. ఈ నాణెములు దొరికిన స్థలానికి "రక్కసి రాళ్ళపల్లి" అని పేరుట. ఇది పాడుపడిన గ్రామం. ఈ నాణెములలో చిన్నా, పెద్దా రెండురకాలున్నవి. వాటిపై పాత కన్నడ, పాలీ అక్షరాలున్నందున యివి క్రీ. శ 1 వ శతాబ్దంనాటివని చెప్పబడుతున్నది.

*ఆంధ్ర ఆదర్శం*

ప్రభుత్వసహాయంతో షెడ్యూల్డు జాతుల ఋణ భారాన్ని తొలగించి వారి ఆర్థికాభివృద్ధికి దోహదం చేయడానికై ఆంధ్రా షెడ్యూల్డుజాతుల సహకార, ఆర్థికసహాయ అభివృద్ధిసంస్థవంటి సంస్థను యేర్పరచాలని షెడ్యూల్డుకులాలు, షెడ్యూల్డుజాతుల కమీషనర్ శ్రీ ఎల్. ఎమ్. శ్రీకాంత్ తన 9వ వార్షిక నివేదిక (1959–60) లో సిఫార్సుచేశారు. ఆంధ్రలో యీ సంస్థ యేర్పాటువల్ల యేజన్సీప్రాంతంలో ఋణభారం 29–31 శాతం తగ్గినది. అటువంటి సంస్థలనే, తగిన మార్పులతో దాదాపు గిరిజనప్రాంతాలన్నిటికి యేర్పాటుచేయాలని ఆయన అభిమతం.

ఈ నివేదిక ప్రతి ఏప్రిల్ 24 న లోక్‌సభకు సమర్పించబడినది.

*ప్రజాస్వామ్య వికేంద్రీకరణ*

"ద్వితీయప్రణాళిక లక్ష్యాలన్నిటిని పూర్తిగా సాధించి, యేపద్దుక్రింద నిర్ణీత మొత్తంకంటె తక్కువ ఖర్చుపెట్టని మూడే మూడు రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి – మిగిలినవి: మహారాష్ట్ర, మద్రాసు. అలాగే రాజస్థాన్, మద్రాసులతోపాటు ప్రజాస్వామ్య వికేంద్రీకరణను ప్రవేశపెట్టిన రాష్ట్రంకూడా యిదే. ఈ పథకం రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ప్రధాని నెహ్రూ, కేంద్రసమాజాభివృద్ధి శాఖామంత్రి ఎస్. కె. డేల ప్రశంసల నందుకొన్నది. అంతేకాక ఈ పథకం అమలును ప్రత్యక్షంగా చూచుటకై జట్లు జట్లుగా యెందరో మన రాష్ట్రానికి వచ్చారు".

— 5-5-1961 తేదీగల "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" లో "ఆంధ్రప్రదేశ్ విశేషాలు" అన్న అంశంనుంచి.

*సుఖాడియా గోల్డుకప్పు గెలుచుకొన్న ఆంధ్రపోలీసు*

హైదరాబాదు ఆంధ్ర పోలీసు మే 14 న అజ్మీర్‌లో జరిగిన మోహన్‌లాల్ సుఖాడియా గోల్డుకప్ ఫుట్‌బాల్ ఆట ఫైనల్‌లో పంజాబ్ పోలీసు, జలందర్, 4-0 ను ఓడించారు.

*అజమాయిషీలేని పరీక్షలు*

సంగంజాగర్లమూడి శ్రీ కె. వి. చౌదరి మెమోరియల్ జిల్లాపరిషత్ పున్నతపాఠశాల గత అయిదుసంవత్సరాలుగా అజమాయిషీలేకుండా తరగతి పరీక్షలను నడుపుతున్నది. ఈ ప్రయోగఫలితాలు ప్రోత్సాహకరంగా ఉన్నందున ఈ సంవత్సరం పెద్దపరీక్షలకు (సాలుసరి పరీక్షలు) కూడా ఈ పద్ధతి అవలంబింపబడినదిట.

*"రవీంద్ర గని", "మోతీలాల్ గని"*

సింగరేణి బొగ్గుగనులలో రామకృష్ణాపురం ప్రాంతంలో ప్రభుత్వంక్రింద నున్న రెండు కొత్త బొగ్గుగనులు మే 10 న తెరువబడినవి. దేశమాత పుత్రరత్నాలైన రవీంద్రనాథటాగూర్ మోతీలాల్ నెహ్రూల శత జయంత్యుత్సవాల చిహ్నంగా ఈ రెండు గనులకు వారిపేర్లుంచబడినవి.

# గ్రంథసమీక్ష

## పంటవలంతి

రచయిత : శ్రీ వజ్ఝల కాళిదాసు

ప్రాప్తిస్థానము : ప్రవాసి ప్రచురణలు, ఆంధ్ర విజ్ఞాన సమితి
విర్దినివాస్, ఎమ్‌రోడ్, జమ్‌షెడ్ పూర్.

వెల 75 నయాపైసలు

భారత ప్రభుత్వ సమాచార ప్రసారామాత్యశాఖ దేశ భాష లన్నింట నిర్వహించిన జానపద నాటకముల పోటీయందు తెలుగు భాషలో అగ్రబహుమతి పొందిన యక్షగాన నాటక మిది. పంట వలతి యనగా భూమియని యర్థము. ఈ యక్షగానను "పాడి పంట లిచ్చు తల్లి పైడి చూలాలివి నీవు, భూదేవీ కావలె మము" అను భూమాతృ ప్రార్థనతో నారంభించి, ఆమె కొసగబడిన మంగళముతోనే ముగియుచున్నది. పల్లెటూరిలో పొలముదున్నుకొని బ్రతుకు రైతులకు సంబంధించిన కథయిందు వర్ణింపబడుటచేతను, సహకార వ్యవసాయ విధానమిందు సమర్థింపబడి ప్రచారితమగుట చేతను దీనికి పంట వలతి అను పేరు పెట్టబడినది.

ఇది యక్షగాన రూపమున గేయ బహుళముగా సులభమైన వ్యావహారిక భాషలో వ్రాయఁబడినది. ఎడనెడ సీసములు గీతములు, వృత్తములు, ద్విపదలు, వచనములుకూడ నున్నవి. ప్రధాన కథా సూత్రమును సూత్రధారుఁడు నడపుచుండఁగా రమ్యములైన సన్నివేశములందు పాత్రలు చేయు గేయరూప సంభాషణలతో యక్షగానము సాగుచుండును. తెలుఁగు భాషలో దక్షిణాంధ్రయుగమున యక్షగానములు తండోపతండములుగా వెలసినవి. అందలి వస్తువులు పెక్కు పౌరాణికములు. తరువాత సంస్కృత నాటక లక్షణములతోఁ గూడిన నాటకముల రచన సాగిన పిమ్మట యక్షగాన రచన సన్నగిల్లెను. మరల నాధునిక కాలమున జానపద గేయములతో పాటు యక్షగానముల రచనయు తలచూపుచున్నది. అట్టి వానిలో ప్రశస్తమై ప్రభుత్వమువారి బహూకృతికి పాత్రమైన ఉత్తమకృతి యిది.

కవి ముఖ్యముగా నిందు బోధింపఁదలఁచిన విషయములు రెండు - ఒకటి సహకార వ్యవసాయము రెండు సహజీవనము. ఈ రెండింటి ప్రచారమున కనుగుణముగా కథ కూర్పఁబడినది. అందులో నానుషంగికముగా గంగమ్మావేమనల ప్రణయ వృత్తాంతముకూడ మిళితము చేయఁబడినది. గంగమ్మ పేద రైతైన పోతన్న కూఁతురు. కాని సద్గుణములకు, పవిత్రశీలమునకు పట్టుఁగొమ్మ. వేమన్న ధనికుఁడైన రంగన్న కుమారుఁడు. తండ్రి యేవో కలిమిగల సంబంధములు తెచ్చినను వేమన్న వానికంగీకరింపక గుణలుబ్ధుఁడై గంగమ్మను వివాహ మాడుట యిందాదర్శప్రాయముగా నున్నది. "సహధర్మచారిణి సహనంబుకలది, సౌశీల్య సద్గుణ సంపద కలది, యైయుండవలయు, భాగ్యము కలవారి బిడ్డకై నేనంత వేడుక పడ" నని యాతడు తండ్రితో ధైర్యముగా చెప్పి యాశీస్సులందఁ గోరుట యువకు లందఱు గమనింపదగిన విషయము.

నాగన్న కాముకుఁడు, దుష్టుడు. అతఁడొంటరిగా కృష్ణలో స్నానమాడి యేగుచున్న గంగమ్మ నడ్డగించి యామెపైఁ బడఁబోయెను. గంగమ్మ నీతులు చెప్పి చేయునదిలేక భగవంతుని భక్తితో ప్రార్థించెను. భగవంతుఁడామె మొరయాలించి రక్షకునిఁబంపెనాయన వేమన యచటికేగి యామెను రక్షించెను. నాగన్నకు దుష్టబుద్ధి యంతతో మాయలేదు. ఆతడు రంగన్న కడకేగి గంగమా వేమనల విలాసవృత్తాంతము తెలిపెను. రంగన్న కోపపూరితుఁడై వెడలి కుమారుని నిందించెను గాని యాతని కోపము వేమన్న స్థిరనిశ్చయమును మరలింపలేక పోయెను.

కృష్ణానదికి వఱద రానున్నప్పుడు గ్రామస్థులెవరి యాస్తి

లను వారే రక్షించుకొన యత్నించుచుండ గంగమయు వేమన యునేగి సహజీవన విధానమును బోధించి వారి మన్ననలకు పాత్రులైరి. నాగన్న పూర్వపరాభవాగ్ని దగ్ధహృదయుఁడై పోతన పొలాలకు సమీపమున చిన్నగండి వేసెను. పోతన నీరు వచ్చి పొలముల ముంచి వేయకుండఁ జేయుటకై గండికడ్డముగా నిలబడెను. గ్రామస్థులు నాగన్న దౌర్జన్యమును దెలిసికొని యతనిఁ జెట్టునకుఁ గట్టి వేసిరి. పోతన్న త్యాగము రంగన్న హృదయమున నపారమైన పరివర్తనము కలిగించెను. అతఁడు తాను ధనమదాంధుఁడై పూర్వమున్న మాటలన్నియు మఱచి తన్ను మన్నింపవలెనని యాతని ప్రార్థించెను.

గంగమా వేమనల బోధనల మహిమచే లక్ష్మీపురవాసు లందఱు సహకార సహజీవనముల చవిఁ యెఱింగి సౌఖ్యమున జీవించిరి.

ఇందలి గేయములన్నియు భావపూరితములై, సర్వజన సుబోధములై, పాడుటకనువై మిక్కిలి యింపుగానున్నవి. 40 పుటయందలి యుగళగీతము శృంగారరసాలవాలమై మనోహరముగా నున్నది. ఎడనెడ సూత్రధార ప్రయుక్తములైన పద్యములు ధారాశుద్ధి శోభితములైన కథాగమనమునకుఁ దోడ్పడుచు నుత్తమమైన యుపదేశము నొసంగుచున్నవి. "అంధుఁడెరుగునే చంద్రికా హాసగతులు, బధిరునకు పికధ్వని వినంబడునే" పుట 36 ఇత్యాది పద్యము లిందుకుదాహరణములు,

శ్రీ కాళిదాసుగారుత్తమ కావ్యములు సృజించిన కవులు. ప్రౌఢమైన కవితను వలెనే జానపద గేయములను గూడ రసవంతముగా నడపించిరి. భాష సర్వత్ర సులభమును సరళమునై పాండిత్యమంతగా నుండని పల్లెజనులకుఁ గూడ నందుబాటులో నున్నది. వ్యావహారిక భాషయే యిందలి గేయములలో వాడఁబడినను కావలె 18; కృపవలనె 22; గంగవేమనలు 51; కాయతరమా 46 వంటి ప్రయోగములను తొలగించుట మంచిది. గర్వపోతు, సహకార సేద్యము మున్నగు పదములు వ్యవహార సిద్ధములగుటచే నింపుగానున్నవి.

## వాస్తవాలు

కర్త : కలన

ప్రాప్తిస్థానము చింతల నరసింహులు అండ్ సన్స్
ఆఫీసు రోడ్, కరీంనగరము లేక ఎల్. యన్. కనపర్తి -
సిరిసిల్ల, కరీంనగరము జిల్లా.
వెల 25 నయాపైసలు

ఇది 116 ఆటవెలదులలో వ్రాయఁబడిన శతకము. ఇందు నీతి, వ్యవస్థ, కులము, మతము, దేవుడు, యుద్ధము, హింస, ముక్తి, సుఖము, మనస్సు మున్నగు 15 శీర్షికలపై గ్రంథకర్తకుఁ గల భావములు స్వచ్ఛందముగా వివరింపఁ బడినవి. ప్రతి పద్యము చివర 'కలన' అను సంబోధనము మకుటముగా నున్నది. ఆధునిక సంఘమును, అందలి వ్యక్తుల అభిప్రాయ వర్తనములను పరిశీలించునపుడు తదంతర్గతములైన అజ్ఞానము మూఢవిశ్వాసములు అభ్యుదయ నిరోధకములై యున్నట్లు తోఁచుటచే వానిని రూపుమాపి పురోగమనమునకు బాటలు దిద్దవలెనను సదుద్దేశముతో వ్రాయఁబడినదే శతకము. జీవితమునకు సంబంధించిన పలు సమస్యలను గూర్చి గ్రంథకర్తకుఁ గల నిశ్చితాభిప్రాయము లిందు స్పష్టముగా గోచరించును.

ఇందలి ఆటవెలదులు పెక్కువిధముల వేమన ఆటవెలదులను తలపునకుఁ దెచ్చుచున్నవి. దుష్టములని తోఁచిన యాచార విశ్వాసములను హేళనచేయుటలో, స్వకీయమైన యభిప్రాయమును స్పష్టముగాఁ జెప్పుటలో, సంస్కరణాభిలాషలో, సరళమయ్యు శక్తిమంతమైన భాషలో రెండింటికిని చాల సామ్యమున్నది. ఆ భావములతో మన మేకీభవించినను ఏకీభవింపకున్నను వానిని వ్యక్తముచేయుటలో గ్రంథకర్త ప్రదర్శించిన స్వాతంత్ర్యనైర్మల్యములను మాత్రము ప్రశంసింపకుండఁజాలము.

"కాలము మార్పుతో నీతులు, కట్టుబాట్లు, బ్రతుకురీతులు మారును. మార్పునందే మంచి పుట్టును. ప్రాతయందు మంచి వలెనే క్రొత్తయందు చెడ్డ కొంతయుండవచ్చును. ఆ రెంటిని బాగుగా పరిశీలించి మంచి చెడ్డల నెంచుకొనవలయును. గోప్య భావమందు కోటి దోషములుండును. గూఢ చర్యలందుకుళ్లు నిండారియుండును. జగమున మానవత్వము పశుత్వము అను రెండే దశలున్నవి. అందు మానవులు తక్కువ పశువులెక్కువ. పుట్టినప్పుడే భూమిపై సర్వజీవులకును సమానములైన హక్కులు కలుగును. సమతా భావము లేని జీవనము సిగ్గు లేనట్టిది. తాము తినఁగా మిగులు ధనమున్యులదని యెల్లవారును భావింపవలయు. పేదవాఁడితరుల సొమ్మును కాసింపక శ్రమపడి బ్రతుకు సాగించును అందుచే పేదబ్రతుకే నిజముగా గొప్పది. కులభేదములు కలహకారణములు, సర్వమానవులును సమానులు. కుల విభేదము స్వార్థపరుల కుటిలచర్యల ఫలితము. మతముల వలన

లను వారే రక్షించుకొన యత్నించుచుండ గంగమయు వేమన యునేగి సహజీవన విధానమును బోధించి వారి మన్ననలకు పాత్రులైరి. నాగన్న పూర్వపరాభవాగ్ని దగ్ధహృదయుఁడై పోతన పొలాలకు సమీపమున చిన్నగండి వేసెను. పోతన నీరు వచ్చి పొలముల ముంచివేయకుండఁ జేయుటకై గండికడ్డముగా నిలబడెను. గ్రామస్థులు నాగన్న దౌర్జన్యమును దెలిసికొని యతనిఁ జెట్టునకుఁ గట్టి వేసిరి. పోతన్న త్యాగము రంగన్న హృదయమున నపారమైన పరివర్తనము కలిగించెను. ఆతఁడు తాను ధనమదాంధుఁడై పూర్వమన్న మాటలన్నియు మఱచి తన్ను మన్నింపవలెనని యాతని ప్రార్థించెను.

గంగమా వేమనల బోధనల మహిమచే లక్ష్మీపురవాసు లందఱు సహకార సహజీవనముల చవిచూచి సౌఖ్యమున జీవించిరి.

ఇందలి గేయములన్నియు భావపూరితములై, సర్వజన సుబోధములై, పాడుటకనువై మిక్కిలి యింపుగానున్నవి. 40 పుటయందలి యుగళగీతము శృంగారరసాలవాలమై మనోహరముగా నున్నది. ఎడనెడ సూత్రధార ప్రయుక్తములైన పద్యములు ధారాశుద్ధి శోభితములైన కథాగమనమునకుఁ దోడ్పడుచు నుత్తమమైన యుపదేశము నొసంగుచున్నవి. "అంధుఁడెరుగునే చంద్రికా హాసగతులు, బధిరునకు పికధ్వని వినంబడునె" పుట 35 ఇత్యాది పద్యము లిందుకుదాహరణములు,

శ్రీ కాళిదాసుగారుత్తమ కావ్యములు సృజించిన కవులు. ప్రౌఢమైన కవితను వలెనే జానపద గేయములను గూడ రసవంతముగా నడపించిరి. భాష సర్వత్ర సులభమును సరళమునై పాండిత్యమంతగా నుండని పల్లెజనులకుఁ గూడ నందుబాటులో నున్నది. వ్యావహారిక భాషయే యిందలి గేయములలో వాడఁబడినను కావలె 18; కృపవలనె 22; గంగవేమనలు 51; కాయ తరమా 46 వంటి ప్రయోగములను తొలగించుట మంచిది. గర్వపోతు, సహకార సేద్యము మున్నగు పదములు వ్యవహార సిద్ధములగుటచే నింపుగానున్నవి.

## వాస్తవాలు

కర్త : కలన

ప్రాప్తిస్థానము చింతల నరసింహులు అండ్ సన్స్
ఆఫీసు రోడ్, కరీంనగరము లేక ఎల్. యన్. కనపర్తి -
సిరిసిల్ల, కరీంనగరము జిల్లా.
వెల 25 నయాపైసలు

ఇది 116 ఆటవెలదులలో వ్రాయఁబడిన శతకము. ఇందు నీతి, వ్యవస్థ, కులము, మతము, దేవుడు, యుద్ధము, హింస, ముక్తి, సుఖము, మనస్సు మున్నగు 15 శీర్షికలపై గ్రంథకర్తకుఁ గల భావములు స్వచ్ఛందముగా వివరింపఁ బడినవి. ప్రతి పద్యము చివర 'కలన' అను సంబోధనము మకుటముగా నున్నది. ఆధునిక సంఘమును, అందలి వ్యక్తుల అభిప్రాయ వర్తనములను పరిశీలించునపుడు తదంతర్గతములైన అజ్ఞానము మూఢవిశ్వాసములు అభ్యుదయ నిరోధకములై యున్నట్లు తోఁచుటచే వానిని రూపుమాపి పురోగమనమునకు బాటలు దిద్దవలెనను సదుద్దేశముతో వ్రాయఁబడినదే శతకము. జీవితమునకు సంబంధించిన పలు సమస్యలను గూర్చి గ్రంథకర్తకుఁ గల నిశ్చితాభిప్రాయము లిందు స్పష్టముగా గోచరించును.

ఇందలి ఆటవెలదులు పెక్కువిధముల వేమన ఆటవెలదులను తలపునకుఁ దెచ్చుచున్నవి. దుష్టములని తోఁచిన యాచార విశ్వాసాదులను హేళన చేయుటలో, స్వకీయమైన యభిప్రాయమును స్పష్టముగాఁ జెప్పుటలో, సంస్కరణాభిలాషలో, సరళమయ్యు శక్తిమంతమైన భాషలో రెండింటికిని చాల సామ్యమున్నది. ఆ భావములతో మన మేకీభవించినను ఏకీభవింపకున్నను వానిని వ్యక్తముచేయుటలో గ్రంథకర్త ప్రదర్శించిన స్వాతంత్ర్యనైర్మల్యములను మాత్రము ప్రశంసింపకుండఁజాలము.

"కాలము మార్పుతో నీతులు, కట్టుబాట్లు, బ్రతుకురీతులు మారును. మార్పునందే మంచి పుట్టును. ప్రాతయందు మంచి వలెనే క్రొత్తయందు చెడ్డ కొంతయుండవచ్చును. ఆ రెంటిని బాగుగా పరిశీలించి మంచి చెడ్డల నెంచుకొనవలయును. గోప్య భావమందు కోటి దోషములుండును. గూఢ చర్యలందు కుళ్లు నిండారియుండును. జగమున మానవత్వము పశుత్వము అను రెండే దశలున్నవి. అందు మానవులు తక్కువ పశువులెక్కువ. పుట్టినప్పుడే భూమిపై సర్వజీవులకును సమానములైన హక్కులు కలుగును. సమతా భావము లేని జీవనము సిగ్గు లేనట్టిది. తాము తినఁగా మిగులు ధనమన్యులదని యెల్లవారును భావింపవలయు. పేదవాఁడితరుల సొమ్మునకాసింపక శ్రమపడి బ్రతుకు సాగించును అందుచే పేదబ్రతుకే నిజముగా గొప్పది. కులవిభేదములు కలహకారణములు, సర్వమానవులును సమానులు. కులవిభేదము స్వార్థపరుల కుటిల చర్యల ఫలితము. మతముల వలన

రక్షింపు"మను భావమే మొత్తమన్ని పద్యములందును గల సారాంశము. 78–87 వఱకుఁగల పద్యములలో శ్రీవిష్ణుని దశావతారములు వర్ణింపఁబడినవి. 88–108 వఱకుఁ గల పద్యములలో నా వాహనము మొదలు మంత్రపుష్పము వఱకుఁ గల షోడశోపచారములు భక్తితోనర్పింపఁ బడినవి. మూఁడు నాలుగు పద్యములలో చినవేంకటరమణ అను సంబోధన వాడఁబడినది.

కవిగారీ పద్యములను 1934 నుండి 1947 వఱకుఁగల కాలమున రచించియుండిరి. ఈ శతకము రజాకార్ల బారిం బడియు శ్రీ వేంకటేశ్వరుని కృపచే నశింపక శేషించినది. పద్యములన్నియు ధారాళములై కుంటుపడక చక్కగా నడచు చున్నవి. ఒక్కటియు నపరిచిత పదముండదు. కవిగారన్న ట్లిందుఁదప్పులు కుప్పలు తెప్పలుగాలేవుకాని యచ్చటచ్చట చిన్నవ్యాకరణ దోషములు కన్పట్టుచున్నవి. అవి ముద్రణ కాలపరితములైనవైన కావచ్చును. నీవు జేయనీశ్వర 11; చుంటివి యెత్తెరగున 18; చెరుపుట 52; తప్పకబ్రోతువు 72; వర మివ్వఁగలేవె, ఎవరు బ్రోతురు 75. మున్నగునవి అందు ముఖ్య ములు. 46వ పద్యమున ప్రాసకొఱకు సెబహాసను పదము వాడఁబడినది. 28వ పద్యమున శబ్దాలంకారమున్నది.

## ప్రజాస్వామ్యంలో మనం, మన సమస్యలు

కర్త : శ్రీ జలగం వేంకటరావు

ప్రాప్తిస్థానము : ప్రధానకార్యదర్శి, జిల్లారచయితల సంఘం, మోహన్‌రోడ్—ఖమ్మం.

భగవంతుని కృపవలనను గాంధీజీవంటి మహానాయకుల నిస్స్వార్థ నిరంతరకృషివలనను మనదేశమునకు స్వాతంత్ర్యము లభించినది. ప్రజాస్వామ్యవిధానము ననుసరించి ప్రభుత్వము సాగుచున్నది. కాని నిజమైన ప్రజాస్వామ్యమనగానేమి, దాని నాదర్శప్రాయముగా చేసి సర్వజనశ్రేయము సంపాదించుట యెట్లు అను విషయములు సామాన్యప్రజల కంతగా తెలియవు. ప్రజాస్వామ్య మూలసిద్ధాంతములు, పంచాయతీరాజ్యము, ప్రణాళికలు, తల్లాభములు మున్నగు సమస్యలనుగూర్చి యెల్ల రకు సుబోధమగునట్లు సులభశైలిలో గ్రంథములువ్రాసి ప్రక టింపవలసిన ఆవశ్యకమెంతైననున్నది. దానిని గుర్తించి శ్రీ జలగం వేంకటరావుగారు కావించిన ఈ ప్రయత్నము మిక్కిలి ప్రశంసనీయమై యొప్పుచున్నది. ఆకృతిని చిన్న దైనను ఈ గ్రంథములో పౌరులు తెలిసికోవలసిన విషయములు చాలగానున్నవి.

మొదట ప్రజాస్వామిక పరిపాలనా వ్యవస్థయొక్క స్థూల స్వరూపము, మూలసిద్ధాంతము వివరింపఁబడినవి. తరువాత "ప్రజాస్వామ్యానికి పంచాయతీ విధానమే మూలస్తంభము, గట్టిపునాది" అను సిద్ధాంతమును పురస్కరించుకొని మనదేశము నందలి పంచాయతీవ్యవస్థ చరిత్ర సంగ్రహముగా తెలుపఁ బడినది. బ్రిటిషువారి పరిపాలనము భారతీయుల వ్యక్తిత్వ మును, వికాసమును కుంటుపడునట్లొనర్చి వారికి పరప్రభుత్వ ముపై ద్వేషము కలిగించినవి. 1882వ సంవత్సరమున స్థానిక పరిపాలనావిధులకు సంబంధించిన కొన్నిసూత్రములు ఉన్మించి క్రమక్రమముగా అభివృద్ధిని పొందసాగినవి. చివరికి 1935వ సంవత్సరమున గ్రామపంచాయతీ వ్యవస్థనుగూర్చి ఒక ప్రత్యేక మైనచట్టము చేయవలెనను నిశ్చయము జరిగినది. 1947లో స్వాతంత్ర్య మబ్బినతరువాత గ్రామపంచాయతీల ద్వారముననే ప్రభుత్వముసాగవలెనను మూలసూత్ర మేర్పడుటచే 1954వ సంవత్సరమునాటికి పెక్కు గ్రామములలో పంచాయతీలు స్థాపింపబడినవి. ప్రజలయిష్టముతో ప్రభుత్వమేర్పడి తదధి కారము ప్రజల ప్రత్యక్షానుభవమునకు రావలెనను సిద్ధాంత మాచరణరూపములోనికి వచ్చుచున్నది. అధికారము కేంద్రీ కృతముకాక అందఱికి సమానముగా పంచబడుటచే నీ విధాన మునకు అధికార వికేంద్రీకరణ పథకమను పేరుకలిగినది. దీనిననుసరించి జిల్లాపరిషత్తులు పంచాయతీసమితులు, పుర పాలకసంఘములు ఏర్పడి స్థానికపరిపాలనమును నిర్వహించు చున్నవి.

పిమ్మట ఉద్యోగులు, ప్రజలు నిర్వహింపవలసిన ధర్మములు వివరింపబడినవి. ఆర్థికపటిష్ఠతకై యవలంబింపవలసిన విధా నము సూచింపబడినది. మనమందఱము భారతజాతీయులము, ప్రజాస్వామ్యమనగా యథేచ్ఛముగా వర్తించుటకాదు, అను భావములు వృద్ధిపొందవలెననియు, అధికారులు ఉద్యోగులు స్వార్థరహితులై లంచగొండితనమునకు గుఱికాక సక్రమముగా వర్తింపవలెననియు, మంత్రులు, ప్రజలు, ప్రభుత్వము కలసి ప్రజాస్వామ్యమును శక్తిమంతముగా సాగించవలెననియు గ్రంథకర్త చక్కగా వివరించినారు.

రెండవభాగములో దేశమునం దార్థికపటిష్ఠత కలిగించు

టకు, జాతీయసంపదను అధికముచేయుటకు, సర్వజనులకు సమత్వము, సౌఖ్యము కల్పించుటకు అవలంబింపవలసిన మార్గములు స్పష్టముచేయబడినవి. స్వాతంత్ర్య లాభానంతరము సమానప్రతిపత్తి సదవకాశాలతోఁగూడిన సామ్యజీవన సిద్ధాంతమును సార్థకముచేయుటకై కాంగ్రెసుప్రభుత్వము కావించుచున్న యత్నములు తత్ఫలితములు వివరింపఁబడినవి. దేశప్రజలు స్వార్థపరుల విభేదకరోపదేశములకు వశముకాక తమ బాధ్యతలను గుర్తించి ప్రభుత్వమున కండగానిల్చి నిర్మాణకార్యక్రమమునకు సంపూర్ణసిద్ధి కలిగింపవలెనని గ్రంథకర్త చేసిన ప్రబోధము గమనింపఁ దగియున్నది. విజ్ఞానశాస్త్ర విషయములలోకూడ ప్రపంచముతో పురోగమించుచు మతవర్గదృష్టులతో వాతావరణమును కలుషితము కావింపక, జాతీయసంపదను పెంపొందించుకోవలెనని వారు చేసిన ఉపదేశము సత్వరమే కార్యరూపమున పెట్టఁదగినట్టిది.

ఈ గ్రంథమునందలి భాష సులభమై, వ్యవహారసిద్ధమై సర్వజన సుబోధమై గ్రంథకర్త ఉద్దేశించిన ప్రయోజనమును చక్కగా నిర్వహించుచున్నది. భావములు సూటిగా వ్యక్తము చేయబడినవి. గ్రంథకర్త స్వానుభవముపై చెప్పినవగుటచే నన్నివిషయములును మిక్కిలి శక్తిమంతములై విశదములై, పఠితల హృదయములను చూఱగొనుచున్నవి. సులభశైలిలో వ్రాయబడు నిట్టి గ్రంథములు సామాన్యజనుల విజ్ఞానసంవర్ధనమున కెంతైన తోడ్పడుననుటలో సందేహములేదు. గ్రంథారంభమున ఆంధ్రప్రదేశ ఆర్థికశాఖామాత్యులైన గౌ. శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు వ్రాసిన విపులమైన పరిచయ వాక్యములు గ్రంథప్రయోజనమును, గ్రంథకర్త సామర్థ్యమును చక్కగా వివరించుచున్నది.

—ది. వేం.



పరఁగఁగ నాల్గు పాదములు బాగుగతుండము ఘీంకృతంబు మా
కిరువురకున్ సమంబె మఱి యెక్కువ యొక్కటి పక్షయుగ్మఖే
చరుఁడను నాకు సామ్య మొక సామజమా? యని దోమ పల్కు న
ట్లరయ మహానుభావులను నల్పుఁడు నోరి కొలందులాడెడిన్

—చాటువు.

# ముఖ్యవార్తలు

**21—4—61**

జిల్లా కలక్టర్ల అధికారాలను జాయంటు కలక్టర్లకు, కొందరు యితర అధికార్లకు అప్పగించటాన్కి వసతి కల్పించే బిల్లు గెజెట్‌లో ప్రకటింపబడినది.

**22—4—1961**

కేంద్ర పరిశ్రమల శాఖ మంత్రి శ్రీ మనూభాయ్‌షా హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్‌లోని చిన్న పరిశ్రమల మహాసభను ప్రారంభించారు.

యాత్రికులు ప్రజలకు "సన్నిహితులై" వారి జీవిత విధానాలను పరిశీలించుటకు వీలుగా రాష్ట్ర సమాచార, పౌర సంబంధాల శాఖ రూపొందించిన "అతిథిమర్యాదల పథకం" ప్రకటింపబడినది.

**23—4—1961**

సనత్‌నగరం పారిశ్రామిక కేంద్రంలోని ప్రగాస్ సాంకేతిక శిక్షణా కేంద్రం తెరువబడినది.

**24—4—1961**

రాబడి పన్ను, సూపర్ టాక్స్‌లకు సంబంధించిన న్యాయ సూత్రాల క్రోడీకరణ, సవరణల నుద్దేశించబడిన బిల్లు ఒకటి లోక్ సభలో ఉప ఆర్థిక మంత్రిణి శ్రీమతి తారకేశ్వరిసిన్హా ప్రవేశ పెట్టారు. సమగ్రమైన యీ బిల్లులో 298 క్లాజులు, నాలుగు షెడ్యూల్సు వున్నవి.

**25—4—1961**

లావోస్ యుద్ధంలో యిరుపక్షాలు యుద్ధ విరమణకు అంగీకరించినవి.

**26—4—1961**

ఆల్జీరియా సైనిక తిరుగుబాటు తుదనెగ్గలేదు. ఆల్జీరియా అంతా మళ్లీ ఫ్రెంచి ప్రభుత్వం క్రిందకు వచ్చినట్టు ఫ్రాన్సు ప్రెసిడెంటు డీగాల్ ప్రకటించాడు.

**27—4—1961**

కీన్యా ఆఫ్రికన్ డెమోక్రాటిక్ యూనియన్ (kadu) కొత్త కీన్యా ప్రభుత్వం యేర్పడినట్టు ప్రకటించినది.

**28—4—1961**

గుంటూరులోని అసిస్టెడ్ ప్రైవేటు పారిశ్రామిక కేంద్రానికి రాష్ట్ర చిన్న పరిశ్రమల మంత్రి శ్రీ కొండాలక్ష్మణబాపూజీ శంకుస్థాపన చేశారు.

**29—4—1961**

భూములు లేని కార్మికులు భూములలో స్థిరపడుటకై ప్రత్యక్షంగా తోడ్పడే నిమిత్తం తృతీయ ప్రణాళికలో రూ. 21 కోట్లు కేటాయించబడినవని న్యూఢిల్లీలో ప్లానింగ్ కమిషన్ సభ్యుడు శ్రీ శ్రీమన్నారాయణ చెప్పారు.

**30—4—1961**

కేంద్ర పరిశ్రమల మంత్రి ఉత్తర కానరాలోని కాల్వారులో రేయన్‌గ్రేడ్ పల్పుప్లాంటుకి శంకుస్థాపన చేశారు. దేశంలో మిక్కిలి పెద్దదైన యీ కర్మాగారానికి పది కోట్లు ఖర్చు కాగలవు.

**1—5—1961**

విద్వాన్ కాశీ కృష్ణాచార్యులను ఒక సంవత్సరం పాటు ఆస్థాన కవిగా నియమించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించినది.

**2—5—1961**

టాగూర్ జీవితంపై సత్యజిత్‌రాయ్ ఫిల్ము ప్రదర్శన, రాష్ట్ర సమాచార, పౌరసంబంధాల శాఖ ఆధ్వర్యం క్రింద జరిగిన కృషితోను రాష్ట్ర రాజధానిలో టాగూర్ జయంత్యుత్సవాలు ఆరంభమైనవి.

**3—5—1961**

కేంద్ర ప్రభుత్వం కృష్ణా—గోదావరి కమిషన్‌ని యేర్పాటు చేసినది. ఈ రెండు నదులలోను లభించే నీటి సరఫరాను సమీక్షించి "1951 పిమ్మట యింకా కోరబడే నీటిలో యెంత భాగం యివ్వవచ్చునో తెలుసుకొందుకు" యిది నియమించబడినది.

**4—5—1961**

హైదరాబాదులోని సాలార్‌జంగ్ మ్యూజియం, సాలార్‌జంగ్

గ్రంథాలయం జాతీయ ప్రాముఖ్యం గల సంస్థ అని ప్రకటించే బిల్లును లోక్ సభ ఆమోదించినది.

**5—5—1961**

అమెరికా తొలి సారిగా అంతరిక్షంలోనికి మానవుని పంపినది. ఇతడు—కమాండరీఅలాన్ షెపర్డు 115 మైళ్ల యెత్తుకి యెగిరాడు.

**6—5—1961**

కొన్ని రకాల క్రొత్త పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి అయిదు సంవత్సరాల పాటు తక్కువ రేట్లకు సరఫరా చేయబడుతుందని ప్రభుత్వం ప్రకటించినది.

**7—5—1961**

శ్రీశైలం, పోచంపాడు ప్రాజెక్టులను యింక యెంతమాత్రము ఆపివుంచవలదని రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి మళ్లీ బలమైన విజ్ఞప్తులను చేస్తున్నది.

**8—5—1961**

భారతీయ జట్టు, నౌకాదళ సిబ్బందికి చెందిన లెఫ్టినెంట్ ఎమ్. ఎస్. కోహ్లీ నాయకత్వాన, అన్నపూర్ణ 3వ శిఖరాన్ని మే 6న అధిరోహించినట్టు ప్రకటించబడినది.

**9—5—1961**

పార్లమెంటు ఉభయ సభలు కలిసి జరిపిన చరిత్రాత్మకమైన సమావేశములో వరకట్నములను నిషేధించే బిల్లు ఆమోదించబడినది. దీని ప్రకారం ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని వరకట్నాలను అడిగినా, యిచ్చినా, తీసుకొన్నా శిక్ష విధించబడుతుంది.

**10—5—1961**

రాష్ట్ర ప్రభుత్వం, వ్యవసాయ కూలీలుగా పని చేసే పురుషులు, స్త్రీలు పిల్లల కనీస వేతనాలను ప్రకటించినది.

**11—5—1961**

విశ్వకవి రవీంద్రనాథటాగూర్ శత జయంత్యుత్సవాల స్మృతి చిహ్నంగా హైదరాబాదులో నిర్మింపబడిన జాతీయ నాటక మందిరం "రవీంద్ర భారతి"ని ఉప రాష్ట్రపతి డా. ఎస్. రాధాకృష్ణన్ ప్రారంభించారు.

**12—5—1961**

సింహళ ప్రధాన మంత్రి స్వర్గీయ భండారనాయకేను చంపుటకు కుట్ర పన్నిన ముగ్గిరుకి సింహళ సుప్రీంకోర్టు యివాళ మరణ దండన విధించినది.

**13—5—1961**

ఆంధ్రప్రదేశ్ లోని శాసన సభ, లోక సభల ద్విసభ్య నియోజక వర్గాల విభజన విషయంలో ఎన్నికల కమిషన్ చేసిన ప్రతిపాదనలకు చెప్పబడే అభ్యంతరాలు, సూచనలు ఎన్నికల కమిషన్ కార్యదర్శికి జూన్ 12 లోగా చేరాలని హైదరాబాదులో విడుదల చేయబడిన గెజెట్ అసాధారణ ప్రకటన తెలియ చేసినది.

**14—5—1961**

పూనా సమీపంలోని హింగ్నేలో బాలికల కమలానెహ్రూ వసతి గృహానికి ప్రధానినెహ్రూ శంకు స్థాపన చేశారు

**15—5—1961**

తృతీయ ప్రణాళికలో తలపెట్టిన అసిస్టెడ్ ప్రైవేటు పారిశ్రామిక కేంద్రాలలో ఒకటి హైదరాబాదులోని ఫలక్‌నూమా రాజప్రసాదం ప్రాంతంలో యేర్పాటు చేయబడగలదని రాష్ట్ర చిన్న పరిశ్రమల మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ హైదరాబాదులో చెప్పారు.

**16—5—1961**

పద్మభూషణ్ నవాబ్ జైన్ యార్ జంగ్ హైదరాబాదులో స్వర్గస్థు లయారు.

**17—5—1961**

గుల్హాతీ కమిషన్ హైదరాబాదుకు వచ్చినది.

**18—5—1961**

అమెరికా వైస్ ప్రెసిడెంట్ లిండన్ జాన్సన్ బాంకాంగ్ నుంచి న్యూఢిల్లీ వచ్చారు.

**19—5—1961**

రాష్ట్ర లలితకళా అకాడమీ కార్యనిర్వాహక వర్గం, ఆర్థిక వ్యవహారాల సంఘం, జనరల్ కౌన్సిల్‌ల యేర్పాటును గురించి రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించినది.

**20—5—1961**

ఫ్రెంచి ప్రభుత్వం ఆల్జీరియాలో నేటి నుంచి ఒక నెల వరకు శాంతిని ప్రకటించినది.

# రచయితలు

1. శ్రీ ఉప్పాడ రాజారావు, పి. ఆర్. గవర్న్మెంటు కళాశాల, కాకినాడ.
2. శ్రీ భార్గవ విద్యాదేవకుల పతి, గుంటూరు.
3. శ్రీ బెల్లంకొండ రాఘవరావు, రంగ్ మహల్ రోడ్, గౌలిగుడ, హైదరాబాదు.
4. శ్రీ జె. బాపురెడ్డి, ప్రొ. డిప్యూటీకలెక్టరు, విశాఖపట్నం.
5. శ్రీ తాళ్లూరు నాగేశ్వరరావు, కొలకలూరు, గుంటూరు జిల్లా.
6. 'బుచ్చిబాబు', ఆల్ ఇండియా రేడియో, పూనా.
7. శ్రీ శనగన నరసింహ స్వామి, పాములపర్రు, భీమవరం తాలూకా, ప. గో. జిల్లా.
8. శ్రీ యస్. ఐ. కొండపి, అడ్వకేట్, హైదరాబాదు.
9. శ్రీ పమిడికాల్వ చెంచు నరసింహాశర్మ, పెనగలూరు, రాజంపేట తాలూకా, కడప జిల్లా.
10. 'వైశంపాయన'—శ్రీ ఎ. దినమణి, ఖమ్మమెట్టు.
11. శ్రీ మండ సూర్యనారాయణ, విశాఖజిల్లా రచయితల సంఘం, విశాఖ పట్నం.
12. శ్రీ కె. ఆర్. కె. ప్రసాద్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్ రవాణా సంస్థ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్, హైదరాబాదు.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | | |
|---|---|---|---|
| వైశాల్యం | .... | .... | 1,06,041 చదరపు మైళ్ళు |
| జనసంఖ్య | ... | ... | 35,977 999* |
| పురుషులు | .... | .... | 18,175,349* |
| స్త్రీలు | .... | .... | 17,802,650* |
| సగటు వర్షపాతం | .... | .... | 35.65" |
| అరణ్య ప్రదేశం | .... | .... | 1,40,26,000 ఎకరాలు |
| **జిల్లాలు** | .... | .... | **20** |
| తాలూకాలు | .... | .... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | .... | .... | 1,000 |
| పట్టణాలు | .... | .... | 293 |
| గ్రామాలు | .... | .... | 26,450 |
| పంటలక్రింది ప్రదేశం | .... | .... | 2,93,81,000 ఎకరాలు |
| కౌళ్ళ సంఖ్య | .... | .... | 42.42.655 |
| 1958-59 లో నీటి పారుదలను పొందిన ప్రదేశం | | .... | 68 లక్షల ఎకరాలు |
| 1958-59 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | | .... | 6,156 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | .... | .... | 15.5 లక్షల గాలన్లు |
| రైలు మార్గాలు | .... | .... | 3009.13 మైళ్ళు |
| జాతీయ రహదార్లు | .... | .... | 1,415 ,, |
| రాష్ట్ర రహదార్లు | .... | .... | 3593 ,, |
| జిల్లా పెద్ద రోడ్లు | .... | .... | 8220 ,, |
| జిల్లా ఇతర రోడ్లు | .... | .... | 2852 ,, |
| గ్రామాల రోడ్లు | .... | .... | 3442 ,, |
| పాఠశాలలు | ... | ... | 34,157 |
| కళాశాలలు | .... | .... | 69 |
| వృత్తి విద్యా కళాశాలలు | .... | .... | 36 |
| తృతీయ పంచవర్ష ప్రణాళిక ప్రమాణం | | రూ. | 305 కోట్లు |

1961-62 బడ్జెటు:

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | .... | రూ. | 85.12 కోట్లు |
| వ్యయం | .... | .... ,, | 87.62 ,, |
| పెట్టుబడి ఖర్చు | .... | .... ,, | 34.55 ,, |

*(1961 జనాభా లెక్కల తాత్కాలిక వివరాల ప్రకారం)

